would become easier, for Dalmia owns both these papers.

Thanks for DAILY NEWS, which published my first despatch, and sent the paper. You ask the Editor to write to me a formal letter incorporating the terms. I am sending him today direct the current week's despatch.

You have not written to me the name of the Editor of the Orient News Agency, and his address. This is essential.

With good wishes,

Yours sincerely,
Radhakrishnan

A.V. Rajeswara Rao Esq. M.A.

... లంక సుందరంగారు కుశాగ్రబుద్ధి. జీవితంలో పైకి రావాలనే ఆకాంక్షగల మనిషి ... ఆయన పేరు అసలు లక్ష్మీ సుందరరామయ్య ...

... విశాఖపట్టణంలో ఉండగా ఆయన తన వసతిని చచ్చుడిపేట మధ్య యేర్పాటు చేసుకుని హరిజన సేవ ప్రారంభించారు. గాంధీగారు విశాఖ పట్టణం వచ్చినప్పుడు ఆయన్ని తన యింటికి తీసుకొచ్చి అక్కడ ఒక చిన్న దేవాలయానికి ప్రారంభోత్సవం చేయించారు. అప్పుడు నేను తాత్కాలికంగా సుందరంగారింట్లో ఉండేవాణ్ణి ...

*

*['డక్కన్ క్రానికల్' కి 'పబ్లిక్ రిలేషన్స్ ఇన్ డెమోక్రసీ' అనే వ్యాసం రాశారు.]*

## PUBLIC RELATIONS IN DEMOCRACY:
### LINK BETWEEN PEOPLE AND GOVT.
**A.V. Rajeswara Rau, M.A.**

There is no gainsaying the fact that People's Government cannot be progressive unless it is constantly in touch with the people. The problem is a complex one, and one that could not be explained away in one column of print. Mr. A.V. Rajeswara Rau, a seasoned journalist, who had been connected with War and Food publicity and public relations in various capacities has presented a clear picture that would be of interest to our readers. – Ed.,D.C.)

In a democratic government, the ultimate test of success of its policies depends entirely upon the approval of its citizens. If this approval is to be offered without reserve, not only must the various services of the Government work satisfactorily but information as to the activities of the government must widely be disseminated and citizens' interest aroused.

Any government which seeks to have its policies on the lasting founda-

tions of popular welfare, the policy of taking public into confidence, cannot be ignored.

It is common knowledge that as their functions expand officials become more and more absorbed in the technical aspects of their tasks. If self-government is to endure and democratic practices be maintained, it behoves those carrying on the responsibilities of Government to take timely and systematic precautions against this affliction. The Businessman very often complains that the Government meddles with his activities without the expert knowledge that is necessary for his success. He finds the official sadly lacking in experience which is necessary for promoting enterprise. With equal truth, the official complains that the businessman is too much immersed in his narrow private enterprise that he is unable to see the larger scheme of things; and that he lacks courage and co-ordination. It is very necesssary that there should be an agency to bring about a realisation of common interest and to co-ordinate their activities. This is no other than the Department of Public Relations.

In the ultimate analysis, the people are the best and the most trust -worthy as judges of what is conducive to their welfare. It is not so easy to ascertain the various trends of public opinion. Usually what generally passes for public opinion is the opinion or set of ideas assiduously propagated by a vocal, intelligent and well organised minority.

In a country like India, the danger from pressure groups of this kind is very great and the Government should not piously sit for a spontaneous outburst of popular approval or disapproval at a future date but must devise ways and means of assessing the amorphous public feeling struggling to express itself.

This can be done by: (a) large scale organisation of people's committees (b) administrative units collecting, classifying and co-ordinating all the information available; and (c) to form a comprehensive picture of the needs and desires of the people.

The public Relations worker will encounter a number of difficulties such as the complexity of modern government and the indifferent attitude of the general public. To these will have to be added, lack of appreciation, lack of funds, difficulty in maintaining impartiality, difficulty in persuading public that public relations is not propaganda, but an honest and sincere attempt to establish sound and proper relations with the public.

There is not just "the public", but a number of them whose range of interests are wide and whose needs and demands are varied. Any programme of public relations must take into account the need for devising different lines of activities. It is also necessary that the programmes must be based upon the presentation of information which flows directly from the records of the agency concerned. Unless it has the full impress of authority, no information supplied will readily meet with the approval of the general public. There is

so much competition that governmental agencies' presentation should be as effective as those of its rivals. There is a general tendency to place reliance on more or less formal methods. It is an important aspect of public relations that personal contacts should be established at every stage.

A Public Relations officer must always be accessible to visitors, must readily accept invitations to social functions must hold press conferences to enable him to answer questions and clear doubts by a direct approach and personal explanation. In the sphere of politics it gives him opportunities of political contacts and informal lobbying.

A Public Relations Officer stands between the responsible administrator and the public spokesman. He can play the part of a counsellor or a liaison officer, and be candid and detached in his views and dealings. He will thus be nearer the public than a "sundried bureaucrat" can ever hope to be and will also be able to exert a salutary influence on the Government officials in the matter of adjusting themselves to suit changing circumstances.

('Deccan Chronicle', ... 1949)

*

## జ్ఞాపకాల వరద
# ప్రెండర్‌గాస్ట్‌లో అంబేద్కర్

సికింద్రాబాద్‌లో ప్రెండర్‌గాస్ట్ స్ట్రీట్ పేరుతో ఓ వీధి వుండేది. ఇప్పుడు ఉందికాని ఆనాటిదాని వైఖరి వేరు. జేమ్సు స్ట్రీటు, ఆక్స్‌ఫర్డ్ స్ట్రీటు కలిసే కూడలికెదురుగా ఉండేది. అన్ని వీధులూ శుభ్రంగా ఉండేవి. నేను 42 సంవత్సరాల క్రితం సంగతి చెబుతున్నాను. ఇప్పుడున్నంత జనసమ్మర్దం అప్పుడులేదు. రోడ్ల మీద యథేచ్ఛగా నడవటానికి వీలుండేది. రోడ్డుకిరుప్రక్కలా యెత్తుగా విశాలంగా పెరిగిన చెట్లుండేవి. ఆ రోజుల్లో నేను ఆక్స్‌ఫర్డ్ స్ట్రీటులో ఉన్న ఓ పెద్ద భవంతి మేడమీద తాత్కాలికంగా ఉండేవాణ్ణి. ఆ భవంతి యిప్పుడూ ఉంది. దానిపేరు పెరీరా బిల్డింగ్. దానికవతల సినిమా హాలుండేది. ఇవతల నాంకింగ్ రెస్టారాంటుండేది. అప్పటి కింకా ఆవీధిలో తాజమహలు హోటలు అవతరించలేదు. ఆ వీధిలో రెండు మూడు నర్తనశాల లుండేవి. మధుశాలలు కూడా అందులో ఉండేవి. సాయంకాలాలు చిద్విలాసంగా ఉండేవి.

ఆ వీధిలో నేనున్నంతకాలమూ రోజూ కొకసారయినా ప్రెండర్‌గాస్టు స్ట్రీటు వైపు వెళ్లేవాణ్ణి. ప్రెండర్‌గాస్టు స్ట్రీటులో పన్నెండో నెంబరు బంగాళా నాలాంటి వాళ్లకి, నగరంలో ఉన్న మేధావులకూ, రాజకీయాల్లో యింతో అంతో ఆసక్తి ఉన్నవారికీ అప్పుడప్పుడు కలుసుకునేందుకు అవకాశమిచ్చే గోష్ఠీకేంద్రంగా ఉండేది. అక్కడ హృదయ పూర్వకమయిన ఆతిథ్యం కూడా లభించేది. నగరంలోని పత్రికా రచయితలు కూడా తరుచూ ఆ యింటి దగ్గిర కనిపించేవారు. ఆ రోజులు పోలీసు చర్య తరువాత రాజకీయంగా హైదరాబాదు రాష్ట్రం అనిశ్చితభవిష్యత్తుకు లోనైన

రోజులు. ఆ బంగళాలో ఆ విషయమే నిత్యచర్చనీయాంశంగా ఉండేది. ఒకవైపు మిలిటరీ ప్రభుత్వం, మరోవైపు కమ్యూనిస్టుల సాయుధవిప్లవం. ఈ రెండింటి మధ్యా స్టేట్ కాంగ్రెస్‌లో అంతః కలహం! ప్రజలాశించిన ప్రజా ప్రభుత్వం యేనాడురాను? పెరీరా బిల్డింగ్‌లో నేనున్నంతకాలమూ ప్రెండర్‌గాస్ట్ స్ట్రీట్‌లో పన్నెండో నెంబరు బంగళాకు ఉదయం, సాయంత్రం పోవటం దినచర్యగా ఉండేది. ఆ బంగళాలో మరో ఆకర్షణ కూడా ఉండేది. హైదరాబాదులో ఎక్కడాలభ్యంకాని అద్భుతమయిన గ్రంథాలయం! ఇంతకీ ఆయిల్లెవరిదో చెప్పాను కాను. జె.హెచ్. సుబ్బయ్యగారు. ఆ రోజుల్లో ఆయన పేరు పొందిన హరిజన నాయకుడు. డాక్టరు అంబేద్కర్‌గారికి అత్యంత సన్నిహితుడయిన అనుయాయి. మామూలు ధోరణిలో ఓ సారి ఆయింటికి పోయినప్పుడు ముందు డ్రాయింగ్‌రూంలో ఒకాయన కూచుని వున్నాడు. కొంచెం స్థూలకాయుడు. కళ్లకు అద్దాలు. స్ఫురద్రూపి. నేను గదిలో ప్రవేశించేటప్పటికి సుబ్బయ్యగారులేరు. ఇంటిపక్కగా ఎడ్డీఅయిబారాతో యేదో మాట్లాడుతున్నారు. ఎడ్డీఅయిబారా ప్రఖ్యాతి పొందిన క్రికెటు క్రీడాకారుడు. సుబ్బయ్య గారికీ అతనికీ ఏవో వ్యాపార సంబంధాలుండేవి. నేను వరండాలోకి వచ్చి నిలబడ్డాను. సుబ్బయ్యగారు నన్ను చూసి చప్పున దగ్గరికొచ్చారు. లోపలికి తీసుకుపోయి “బాబాసాహెబ్” అని ఆయన్ని పలకరించి నన్ను పరిచయం చేశారు. ఆయనకో నమస్కారంచేసి వచ్చేశాను. అప్పుడాయన కేంద్రమంత్రివర్గం నుంచి రాజీనామా చేసింతరవాత కొన్నాళ్లకు ఓ వారం రోజులపాటు విశ్రాంతి కోసం హైదరాబాదు వచ్చారని గుర్తు. ఆ సాయంకాలమే నేనూ సి.ఎస్. నాయుడూ ప్లాజా దగ్గర నిలబడి మాట్లాడుతున్నప్పుడు సుబ్బయ్యగారటువైపు పోతూ కారాపి నన్ను సాయంకాలం ఓ సారి యింటికి రమ్మన్నారు. తప్పవినరా అన్నాను. ‘కొంచెం నాకు వేరే చోటికి పోవలసిన పనుంది. బాబా సాహెబ్‌తో సాయంకాలంతోడుగా వాహ్యాళికి వెళ్లి రావలసి ఉంటుంది. ఆయన సంతోషిస్తారు”. అన్నారు. కారెక్కుతూ ‘అక్కణ్ణే భోం చేద్దువుగాని– బాబాను కూడా రమ్మన్నాను” అన్నారు. బాబా అంటే డాక్టరు ముత్యాల జయసూర్య. సరోజినీ నాయుడుగారి అబ్బాయి.

అలాగే అన్నప్రకారం సాయంకాలం అయిదూ అయిదున్నర గంటల ప్రాంతానికి సుబ్బయ్యగారింటికి వెళ్లాను. వరండాలోకి కాలుపెట్టానోలేదో బాబా సాహెబ్ కూడా వరండాలోకి వచ్చి నిలబడ్డారు. నన్ను చూసి మందహాసం చేశారు. నేనూ మందహాసం చేస్తూపోదామా అన్నాను. కారు కూడా ముందు కొచ్చి ఆగింది. ఆయన ముందుగా యెక్కారు. సైగచేసి నన్ను పక్కనే కూచోమన్నారు.

కారుబయలుదేరింది. డ్రైవరు యెక్కడికి పోవాలన్నాడు. ఆయనవంక చూశాను. ఆయన నవ్వుతూ ప్రశాంతంగా ఉన్న చోటికి పోయి వద్దాం అన్నారు. నేను ఉస్మానియా విశ్వవిద్యాలయంవైపు పోనీ అన్నాను. కారు పోతోంది. డాక్టరుగారు అటూయిటూ చూస్తున్నారు. ఇంత చరిత్ర ఉన్న వ్యక్తి ప్రక్కన కూచోవటం నాకోవింత అనుభూతిలా ఉంది. కారు తార్నాకా సమీపిస్తోంది. “మీవూరు బావుంటుంది’. అవునన్నాను. మళ్లీ కొంత సేపు యిద్దరం మౌనంగా ఉన్నాము. కొంచెం ధైర్య తెచ్చుకుని “బాబా!” అని నాలిక కరుచుకున్నాను. ఆయన్నెలా సంబోధించాలో తెలీక. డా. జయసూర్యను బాబా అని పిలవటం అలవాటు. పొరపాటువల్ల ఆయన్నలా అన్నాను. ఆయన

నావంక చూసి, అలానే అను తప్పులేదు. నేనేమీ అనుకోను, అన్నారు. ఎందుకయినా మంచిదని నా వృత్తి కనుకూలంగా ఆయన్ని డాక్టర్ అని సంబోధిస్తే బాగుంటుందనుకున్నాను. నేనప్పుడు పత్రికా విలేఖరిగా ఉండేవాణ్ణి.

'డాక్టర్! మన హైందవ సంస్కారాన్ని పరిపూర్ణంగా క్షాళనంచేసే సాహసమయిన కార్యక్రమాన్ని చేపట్టారు. ఎంతవరకు జయప్రదమయిందని మీ భావన?' అన్నాను. ఆయన మాట్లాడ్లేదు. నేనలా రాజకీయాలు మాట్లాడటం ఆయనకిష్టం లేదేమోననుకుని భయపడ్డాను. విశ్వవిద్యాలయం ఆవరణంలోకి ప్రవేశించాము. చక్కని వాతావరణం చుట్టుపక్కల కనులపండువుగా పచ్చదనం. దాదాపు నిర్మానుష్యంగా ఉంది. డ్రైవర్ని కారాపమన్నారు డాక్టర్. అప్పుడు నావంకచూసి నేను ప్రభుత్వంలోంచి బయటపడటమే నేను కృతకృత్యుణ్ణి కాలేదనటానికి నిదర్శనం. అయినా నేనెవర్ని అంతపెద్ద కార్యక్రమాన్ని చేపట్టటానికి? నా లక్ష్యం నా వర్గానికి పరిమితం. అనాగరకమైన యీ అస్పృశ్యత అంతంకావాలన్నదే నాలక్ష్యం. నాకు రాజకీయాల్లేవు. నేను సామాన్య మానవుణ్ణిగా మాట్లాడతాను. మానవత్వం నాక్కావాలి" అన్నారు. అయితే ఆయన మాట్లాడుతుంటే ఓ నిండైన పెద్దమనిషి మాట్లాడుతున్నట్టుంది. ఆవేశం లేదు. ఒక్క పరుషవాక్యం లేదు. ద్వేషం లేదు. నాకాశ్చర్యం వేసింది. అలాంటి ప్రశ్న నేనెందుకు వేశానా అని అనిపించింది.

కారులోంచి ఆయన దిగారు. నేనూ దిగాను. అక్కడ చెట్లమధ్య మెల్లిగా నడుస్తున్నాము. ఆకాశంవంక చూస్తూ "యింత అద్భుతమయిన ప్రకృతి కింద మనం మహా వికృతిగా కనిపిస్తాం కదూ" అన్నారు. 'నిజం, నిజం' అన్నాను నేను. మళ్లీ కారెక్కి బయలుదేరాం. నేను ప్రారంభించాను. 'డాక్టర్ – నేను మీకు తెలుసునో తెలియదో యం.యన్.రాయిగారి అంతేవాసిని. కొంచెం ఆశావాదిని. అస్పృశ్యత ఈ దేశంలో అంతమవుతుందని విశ్వాసం వుంది. అయితేకాలం పడుతుందేమో. నా శైశవంలో మాయింట్లో అస్పృశ్యత నేను చూడ్లేదు. మాలాంటి కుటుంబాలు రానురాను విస్తరించగలవని నానమ్మకం.' 'అలా జరిగితే నేనూ సంతోషిస్తాను– కాని అలాంటి సూచనలింకా నాకు కనిపించటం లేద'న్నారాయన."మీకో సంగతి చెబుతాను. మా రాష్ట్రంలో ఓ ముప్పయి సంవత్సరాల కిందటిమాట – ఒకాయన– ఆయనపేరు మీరు విన్నారోలేదో – దుగ్గిరాల గోపాలకృష్ణయ్య–ఇప్పుడు లేరు–ఓఆసక్తికరమైన ప్రయోగం చేశారు. చీరాల సత్యాగ్రహం సమయంలో వేరే ఒక గ్రామాన్ని నిర్మించి దానికి రామనగరం అని పేరు పెట్టారు. అక్కడ కులవ్యవస్థని నిషేధించారు. ఆ గ్రామంలో ప్రతీవ్యక్తి బ్రాహ్మణుడే అని తలో జందెంవేసి గాయత్రి ఉపదేశించారు! నిజంగా అన్ని వర్ణాలవారూ అస్పృశ్యులు కూడాబ్రాహ్మలై పోయారు! ఆ ప్రయోగాన్ని యావద్భారతానికీ వర్తింప చేయాలని ఆయన ఆశించారు. ఆయన చేసింది సవ్యమైనా అపసవ్యమైనా అస్పృశ్యత నాశనం కావాలంటే వర్ణవ్యవస్థ సమూలంగా నాశనం కావాలి అని మా కోరిక" అన్నారు. 'గోపాలకృష్ణయ్య ఆసక్తికరమైన వ్యవహారమే చేశారు. ఏంలాభం? హిందూ సంస్కారం క్లిష్టమైన వ్యవహారం–చూదాం' అన్నారు.

"డాక్టర్, అస్పృశ్యత పోతుంది. తప్పక పోతుంది. కులవ్యవస్థపోదని నేననుకుంటున్నాను. మీ కంటేవయస్సులోనూ అనుభవంలోనూ చిన్నవాణ్ణి. మీరు క్షమించాలి" అన్నాను.

కారు ప్రెండర్ గాస్టు స్ట్రీటువైపు మళ్లింది. ఆయన కారు దిగుతూ, "నీకు నమ్మకాలెక్కువ"

అన్నారు నవ్వుతూ.నేను మాట్లాళ్లేదు. తరవాత ఒకటి రెండుసార్లు ఆయనతో కలిసి తిరిగినా ఆ విషయాలమీద మళ్ళీ నేను మాట్లాళ్లేదు.

ఆయన వూరు విడిచివెళ్ళే ముందనుకుంటాను-ఒక రోజున ఉదయాన్నే బయలుదేరాను సుబ్బయ్యగారితో ఆకస్మాత్తుగా పనిపడి. ఆక్స్‌ఫర్డ్ స్ట్రీటు దాటుతుండగా యెదురుగా ఆయనే-డాక్టర్ అంబేద్కరు నిలబడి వున్నారు. మరీ ఉదయం కనక యెటువైపూ జనం కూడా అట్టేలేరు. నేను నమస్కరించాను. దూరాన్నుంచే చేతికర్రతో సైగచేశారు. తోచక అలా నడిచానని చెప్పారు. ఆ వీధి అంత బాగుండేది-చక్కని దారీ, పచ్చని చెట్లూనూ.

అదే ఆఖరిసారిగా ఆయన్నికలుసుకోవటం. తరువాత ఆయన దర్శనం తటస్థపడలేదు. ఆ ఉదయాన యాదృచ్ఛికంగా నాకు సాక్షాత్కరించిన ఆయన మూర్తీ-అదృశ్యం యీ నాటికీ ప్రస్ఫుటంగా నాకుజ్ఞాపకం.ఇప్పుడా వీధి పేరు ఉంది. ఆ వీధి లేదు. సుబ్బయ్యగారి యిల్లూ లేదు. సుబ్బయ్యగారూ లేరు. ఆయన సంస్కారాన్ని ఆయనతో తీసుకుపోయినట్టున్నారు. అంబేద్కరుగారి స్మారక చిహ్నానికి నిజానికి ఆ వీధి ముందే సముచితస్థానం.

('సుప్రభాతం', 5 నవంబర్ 1991)

## 'భారత్' (బొంబాయి) విలేఖరిగా

*[హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్‌కు పబ్లిసిటీ సెక్రటరీగా ఉంటూనే భారత్(బొంబాయి) పత్రికకు హైదరాబాద్ విలేఖరిగా డిసెంబరు 1949లో నియమితులయారు. ఆ తరవాత హైదరాబాదులో వెల్లోడి ప్రభుత్వంపై రాసిన సమీక్షావ్యాసం 'స్వతంత్ర' లో అచ్చయింది.]*

# M.K. VELLODI:
## CHIEF MINISTER OF HYDERABAD
A.V.Rajeswara Rau, M.A.

"Peace," it has been said, "is the dream of the wise, war is the history of man." Human nature, always ready to transgress laws, delights to show that her passions are ungovernable and that she is stronger than justice. For, how otherwise was a clash of arms necesssary to make the Nizam and his crazy advisers see reason? How could Hyderabad, a land-locked State in the very heart of the Indian Union, convert itself into a sovereign theocratic State based upon a six percent muslim minority? But that was the dream of the advisers of the Nizam and it had to be ended.

At the first contact with realities, all resistance collapsed. The military operations were a five days' wonder. With the appointment of Maj,-Gen. Chaudhury the first phase ended and the gulf across which interminable negotiations with the Nizam were carried on was definitely closed.

There was nothing millitary about the administration of Maj.-Gen. Chaudhury. He simply initiated the second phase of restoring order in the State. For fourteen months he laboured with single-minded devotion to root out the fanatical Razakars and has succeeded. The methods that he adopted towards this end were more conciliatory than ruthless. Critics were not lacking who pointed out the many flaws in his administration but, looking back at these fourteen months, we cannot but feel that the New Hyderabad that he has left is full of a new hope and a new self-confidence. But communist gangsterism still remains although its further growth has been arrested to some extent.

Mr. M.K. Vellodi has been chosen at this critical juncture to undertake the heavy burden of being the Chief Minister of Hyderabad. His appointment comes close upon the latest *Firman* of the Nizam announcing the accession of his State to the Indian Union.

What manner of person is Mr. Vellodi?

Mr. Mullath Kadungi Vellodi, is a son of the wealthy and cultured Zamorin of Calicut, and was born on January 14, 1896. He had his early education at Zamorin College and later graduated from Presidency College, Madras. At the age of 25, he joined the Indian Civil Service and served his home province for over a decade and a half, in various capacities as Collector and District Magistrate, Special Settlement Officer, Director of Land Records and Secretary to the Orissa Government, first in the Education Department and later in the Revenue and Development Departments for over two years. His quiet dignity and administrative efficiency were soon recognised by the Government of India who appointed him as Price Advisory Officer. From

1942 he was Export Trade Controller (Bombay) until he became Textile Commissioner in 1945. In Novermber 1945, Mr. Vellodi was sent to London as Deputy High Commissioner to the Government of India and after two years was made High Commissioner. During this period he did a big job in thoroughly overhauling and renovating the administrative set-up of the India House which was then a by-word for inefficiency and indiscipline.

In September 1947 he attended the United Nations Assembly as Secretary-General to the Indian Delegation. He was also included in the delegation to the Security Council along with Mr. N. Gopalaswamy Ayyangar.

On his return from Lake Success Mr. Vellodi joined the External Affairs Ministry as Special Officer for liaison with the U.N. Commission on Kashmir. In 1948 he was appointed Secretary to the States Ministry. In this capacity he took an active part in the historic task of territorial integration of the States under the guidance of Sardar Vallabhbhai Patel.

Thus for years he has assisted at the councils of the nation. He has held office in many administrations and in many capacities. He has been praised by men of all parties and persuasions. His manners are easy and in conversation he radiates a charm which makes you feel quite at home in his presence. He talks little but always to the point. He has the knack of parrying an awkward question with a witty remark that helps to keep himself and his visitors in good humour.

Even a casual observer cannot fail to notice that he dislikes particularly two qualities, intrusiveness and cocksureness. His irony, when unkind, is usually provoked by the exhibition of one of these characteristics.

Mr. Vellodi as Chief Minister of Hyderabad presides over a cabinet of picked men selected under advice from the States Ministry. This might, at first sight, seem to be a rebuff to the State Congress which has been clamouring for a popular government. This is perhaps a move initiated by the far-seeing and sagacious chief of the States Ministry, Sardar Vallabhbhai Patel, and yet another warning to the leaders of the State Congress to close up their ranks.

It is true that the Congress organisation in the State is riven by internal dissensions, some of them personal which could be composed, some of them ideological which could be cleared up. But the main difficulty in the path of unity does not lie here. The leaders of the State Congress are victims of historical circumstances rather than ideological or personal preferences. The ramshackle structure of the Hyderabad State was kept going under the benevolent protection of an imperial power, and its despotic feudal overlord was allowed to reign in pomp over a people reduced to serfdom by the rapacious Jagirdars and Deshmukhs. During those dark days, the State Congress fought bravely for the dispossessed and dumb millions in the State.

Its record of sacrifice compares favourably with that of the parent organisation in British India. After the Police Action, there was a radical, almost a revolutionary change in the outlook of the State Congress leaders. They could no longer think of Hyderabad in isolation. The three linguistic groups began working with their loyalties divided between the State and the contiguous districts in independent India. Hyderabad is no longer a State bound by a common linguistic or cultural tie or even a common fear of the despot. It is a medley of groups each anxious to integrate with a larger neighbouring community of which it is a ntural part. The idea of making the Nizam a Rajapramukh will not evoke the slightest enthusiasm in the people. On the contrary it may bring about a minor upheaval.

There is then the question of combating Communist violence. This is not a malady that affects Hyderabad alone. It is an All-India problem, nay, a global problem. The Communists are supposed to draw their inspiration from a world-wide movement with its centre in Soviet Russia. But the Indian Communists are a queer lot. Judging from their latest policy and programme, they are like the Chinaman who burned his house down to taste the delights of roast pork. It is not as though they would stop burning their houses if other fires were provided to roast their pork in. They are a fanatical lot obedient to their leaders. The Prime Minister was right when he characterised the Indian Communists as a nuisance. But they can be a dangerous nuisance at times. Too much publicity is being given to their violent ways today in the press and on the platform. Instead of alienating the sympathy of the public for them, it is helping to generate a kind of panic in the peaceful section of the community. The Communists are motivated by a blind faith that they are crusaders of a world movement. Only a counter movement can be an effective answer. Half-hearted land reforms and fullthroated speeches promising better conditions in a distant future will not be enough. The pace for clearing up the agrarian mess in Telangana must be quickened. Large masses must be re-assured by practical measures, that they are participants in a vast field of constructive social endeavour to improve their lot. To rely merely on propaganda and the strong arm of the Government is to court disaster.

Mr. Vellodi enters the State when these and many other important and highly controversial questions in the field of domestic policy await decision. In this he has a right to expect the whole-hearted support of the political parties in the State. Political democracy will not be a reality unless the distinction between "party politics" and serious political thinking is broken down. Men of judicial calm and unswerving intellectual integrity like Mr. Vellodi can bring an unbiassed mind to the discharge of their duties and help the democratic process.

Mr. Vellodi will be no more rubber stamp for administrative measures but can be relied upon to bring his own independent judgment to the solution of the major questions of the day and the State will profit from his broad adminstrative experience and his realistic liberalism.

('Swatantra', December 17, 1949)

## The Hindustan Newspapers Ltd.

Directors
Sjt. S.K. Patil
Chairman
Sjt B.A. Khimji
Sit P.M. Chinai
Sjt Dahyabhai V. Patel
Managing Director.

Akhil Bharat Bhavan
341, Tardeo, Bombay-7.
11th July 1950.

My dear Shri Vellodi,

This is to introduce Shri A.V. Rajeshwara Rao. I believe you know that he is working as the Publicity Officer of the Hyderabad State Congress and is also doing a little work for our newspapers.

When I was in Hyderabad I spoke to you about the question of purchase of tractors by Hyderabad State. Besides the matter I mentioned to you, I now understand that some tractors rejected by the Government of Madras are supposed to have been dumped upon Hyderabad by interested persons. I am just passing this on to you for your information.

With kindest regards,

The Hon'ble Shri M.K. Vellodi, I.C.S.,
Chief Minister,
Hyderabad Government,
Hyderabad-Deccan.

Yours sincerely,
Dahyabhai V. Patel
(Dahyabhai V. Patel.)

## హైదరాబాద్ జర్నలిస్ట్స్ కాన్ఫరెన్స్ ...

అప్పుడు సారస్వత పరిషత్తుకి నూకల నరోత్తమరెడ్డి గారు అధ్యక్షుడనుకుంటాను. నరోత్తమరెడ్డీ, నేనూ స్నేహితులం. అఖిల హైదరాబాదు పత్రికా రచయితల సంఘానికి నేను కార్యదర్శిగా ఉన్నప్పుడు నరోత్తమరెడ్డి కోశాధికారిగా ఉండేవాడు.

[హైదరాబాదు జర్నలిస్ట్సు యూనియన్ సభ్యులు కొందరు
ముందు వరసలో: నూకల నరోత్తమరెడ్డి, మొదలైనవారితో 'వరద']

*[వరదరాజేశ్వరరావుగారు 'హైదరాబాద్ యూనియన్ ఆఫ్ వర్కింగ్ జర్నలిస్ట్సు' సంస్థాపకులలో ప్రముఖులు. ఆ యూనియన్‌కు జనరల్ సెక్రటరీగా పనిచేశారు.*

*జూన్ 1950లో హైదరాబాదు జర్నలిస్టుల సమావేశం జరిగింది. ఆ సమావేశానికి కృషిచేసిన ఇద్దరు కార్యదర్శులలో అబ్బూరి వరదరాజేశ్వరరావుగారు ఒకరు.]*

# The Hyderabad Union of Working Journalists

T S Neelakantan
*PRESIDENT*

A. V Rajeswara Rau
*GENERAL SECRETARY*

P. K Krupakaran
*ORGANISING SECRETARY*

HYDERABAD

D

[హైదరాబాద్ జర్నలిస్ట్స్ యూనియన్ సభ్యులు, ఇతర ప్రముఖులు
ముందు వరసలో మధ్యనః డా. బూర్గుల రామకృష్ణారావు;
కుడివైపునః డా. లంక సుందరం, జమలాపురం కేశవరావు, హయగ్రీవాచారి,
మొదలైన వారు; ఎడమవైపున చివర నుంచి 'వరద', పి. వామన్ రావు,...]

# The Searchlight

(Prop —The Behar Journals Ltd.)
THE PREMIER ENGLISH DAILY OF BIHAR

POST BOX No. 43,
*PATNA.*

*Ref. No... ....*

December 29,1949.

My dear Rajeswara Rau,

Your letter of December 27. I shall let you know my final decision about January 5. If I come I shall come by air and you will have to send me passage tickets both ways, before I leave Patna.

I can promise you a good speech. I don't believe in written addresses. you will get a press summary from me.

I have been hearing about you.... your good fortunes and bad.

Yours Sincerely,

Yours sincerely,

K Rama Rao

EDITOR.

Abburi V. Rajeswara Rau Esq.,
Hyderabad Journalists Conference.
103, Alexandra Road,
Secunderabad.

Bombay London Calcutta

# THE HITAVADA

*(ENGLISH DAILY OF THE SERVANTS OF INDIA SOCIETY)*

*Telegram* "HITAVADA".
*'Phone:* 444.

P.O. BOX 23,
AJNI JAIL ROAD
NAGPUR—1.

6th February 1950.

Dear Mr. Rajeswara Rau,

Let me introduce to you Mr. Curran, who is a scholar of the Institute of Pacific Relations of the United States. Mr. Curran is now in India studying Indian political problems and he is starting on a tour of the country to meet people and to understand various points of view. He wanted me to suggest the name of somebody who would talk to him frankly and give him an impartial appraisal of the situation in Hyderabad. I know that conditions in Hyderabad are difficult but you can rest assured that whatever you tell Mr. Curran will be treated as in confidence and will not be made use of in any manner except perhaps for understanding the situation in your part of the country.

With kind regards.

Yours sincerely

(A.D. Mani)

Shri A.V. Rajeswara Rau,
Sec. All Hyderabad Journalists' Conference,
King's Way, Hyderabad.

*

## J.A. Curran Jr.

Research Associate, Institute of Pacific Relation
percy's Hotel, Secunderabad.

Mr. A.V. Rajeswara Rau,
Representative, Bharat of Bombay,
Poorna Pictures,
3231-King's way,
Secunderabad.

February 11,1950.

Dear Mr. Rau,

I don't know how to thank you for your great help of the last three days. Thanks to you I do believe I have gotten a start as to what the picture in this part of the Indian Union looks like. Next time I come here I will also, thanks to you, know various people to contact and will be in a good position to commence a real study of what are the important facets in the political seen here.

Thanks again Mr. Rao for your unbelievable kindness and unselfishness to a stranger from a distant country. If you should get to Delhi next September and October, be sure to look us up at Maiden's and I will be glad to be of any service that may help you.

Also kindly thank your good friend Mr. Nageshwar Rao* for his kindness to me while I was here.

You're both two wonderful gents.

Hoping you're well, and looking forward to seeing you again. I am,

Sincerely,

Jean A. Curran Jr.

*[Varada Rajeswara Rau's friend R.Nageswara Rao (film star)]*

# THE ALL HYDERABAD JOURNALISTS' CONFERENCE

*President*
M NARSING RAO

HYDERABAD-Dn

*Secretaries*
R G JAGIRDAR
A V RAJESHWAR RAO

# హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్

... రామకృష్ణారావుగారు *[బూర్గుల]* వెల్లోడి ప్రభుత్వం లో విద్యామంత్రిగా చేరటం సంభవించింది ... ఆయన మహోదాత్త మనస్కులి. ఆ రోజుల్లో నేనాయన ఆంతరంగిక వర్గంలో ఉండేవాణ్ణి.

ఇంతలో ఎన్నికలు రావటం, తన్మూలకంగా హైదరాబాదులో మొదటి ప్రజాస్వామిక ప్రభుత్వం ఏర్పడటం జరిగాయి. రామకృష్ణారావుగారు ముఖ్యమంత్రి అయారు ...

***Portrait Gallery***

**HYDERABAD LEGISLATIVE ASSEMBLY**

From A Special Correspondent

*[A.V. Rajeswara Rau]*

The Hyderabad legislature is the miniature of the Indian Parliament. In it we find a blend of the North and the South, a curious mixture of conflicting ideologies and a virtual cultural confluence. Six languages, English, Hindi, Urdu, Marathi, Telugu and Kanarese, are spoken on its floor. The Assembly represents four political parties and a host of Independents.

The strength of the House is 175; but there are only 170 members with five by-elections pending. Having annexed 93 seats, the Congress has an absolute majority. The Opposition includes 33 members of the People's Democratic Front, 11 Socialists, 10 Peasants and Workers, five Scheduled Caste members and 13 Independents. A new bloc under the banner of the United People's Party came into existence during the recent session with a membership of 36 belonging to the Opposition.

To the members and the public the experience–it was new and exhilarating–of democracy, was the first of its kind. The experience, in the initial stages, led to interesting episodes. A Bill on sale of commodities was moved and later found to be inconsistent with a certain provision in the Constitution. In-stead of being gracefully withdrawn, the Bill was referred to a select committee for consideration! Within three days of a Bill having gone through the House in all its stages, an amendment was sought to be moved. When the budget was presented, the Minister had to use the proof copy and neither the members nor the Press were supplied with copies.

**The Speaker**

Mr. Kashinathrao Vaidya, Speaker, and Mr. B. Ramkrishna Rao, the Chief Minister, are, so to say, the long and short of the Hyderabad Assembly.

Mr. Vaidya's upright figure and pleasing countenance command respect. Although he is new to parliamentary practice, he has exhibited a good grasp of the intricacies of his work and his responsibilities.

**Ministers**

The leader of the House, Mr. B. Ramkrishna Rao, though diminutive in size, is the dominating personality in the Assembly. In eloquence and debate he has no equals. Policies and programmes are evolved on the floor of the Assembly in the course of his speeches. He talks to keep everybody guessing and probably to please everyone. He never gets irritated nor resorts to obloquy to hurt his adversaries. Unfortunately, he is indecisive; his pleasing utterances lead us nowhere. He speaks in more than six languages and is at a decisive advantage during the question -hour. His reply to the Communists on the Telengana issue and his unfinished analysis of the Osmania University problem evoked sincere admiration even from the Opposition. He is social, jovial and freely accessible.

Mr. D. G. Bindu, who is in charge of Home Affairs, has the figure and the look of a Minister. He is simple but commanding with his detached outlook on life. His replies are marked by sincerity and determination. He is the strong man of the Cabinet and an intellectual among politicians. He is 'moderate in exercizing power, not equitable in engrossing it.'

The Commerce Minister, Mr. Vinayakrao, has developed intrepidity from his long association with the Arya Samaj. He is dull and devoid of colour in debates.

Mr. Phoolchand Gandhi, the Education Minister, is known for his frankness and for his occasional irrelevant outbursts in the House. His approach to problems is not always broad-minded or positive.

Fluent in speech but rather faulty in expression is the Labour Minister, Mr. V.B.Raju. He belongs to that class of politicians who appear to know something about everything. He is the Confucius and the Karl Marx of the Congress Party. The interests of labour are quite safe in his hands.

Dr. Melkote, the Finance Minister, does not seem to find himself at home in economics. Barring public finance, he can talk at length on any topic. Since he is entitled to read out a printed statement, he overcomes a larger part of the ordeal. His replies to the discussion on the budget showed his lack of familiarity with the subject. Unwittingly he makes commitments creating difficulties for the Government.

The Excise Minister, Mr. Ranga Reddy, is the grand old liberal of State politics. He speaks with caution and conviction. He is respected for his strength of character.

Dr. Chenna Reddy is a changed man since he became the Supply Minister. He was once a problem child of the Pradesh Congress. He is now

a little grown up and looks responsible. His hoarse voice and his rather irritated expression do not make for cheerfulness. Young and energetic, Dr. Reddy suffers from a parochial view of things.

Mr. Jagannathrao Chanderki, the Law Minister, is a promising young parliamentarian. The Local Self-Government Minister, Mr. Anna Rao, is unassuming and speaks slowly with good reasoning. Mr. Devisingh Chauhan, who is entrusted with Rural Reconstruction, has not been very active in the Assembly. The Harijan Minister, Mr. Shankerdev's age and appearance hardly invest him with ministerial dignity.

The P.W.D. Minister, Nawab Mehdi Nawaz Jung, who refuses to wear khadi, comes in his own attire and talks as if he were addressing, a governmental committee.

There are some figures in the Congress Party itself who have already made an impression as good parliamentarians and powerful debaters. Mr. Gopalrao Ekbote evokes admiration with his legal acumen. Mr. M. Narsing Rao's erudite speeches show his profound knowledge of the State's politico-economic structure. Among the younger elements. Mr. Konda Lakshman and Mr. Rajalingam have a bright future. Mr. Lakshman was dubbed by the Opposition as the fourteenth Minister when he overshot the mark and asked for notice during a debate.

The People's Democratic Front leader, Mr. V.D. Deshpande, is vigilant and takes the Treasury benches unawares by his points of order. His speeches are at times impressive. Mr. Raj Reddy and Shrimati Kamla Devi have proved an asset to the Front with their quickness in retaliation as well as in defence.

Mr. Annajirao Ghavane, the Peasants and Workers leader, who also leads the United People's Party, has, in spite or his university degree in law, a rustic appearance and is not very polished in speech. The Socialist leader, Mr. Rajaram, is the good boy of the Assembly. Neither his tone nor his temper seems to help him to reach the front rank.

(The "Hindustan Times
Sunday Magazine",
New Delhi : Sunday, September 21, 1952)

*

... రామకృష్ణారావుగారు ముఖ్యమంత్రిగా ఉండే రోజుల్లో సారస్వత పరిషత్తు భవన నిర్మాణం ప్రారంభించారని గుర్తు. ఒక రోజున నరోత్తమరెడ్డి నాదగ్గర కొచ్చి అప్పటి గృహమంత్రిగా ఉన్న దిగంబరరావు బిందుగారితో నామాట సహాయం కావాలన్నాడు. ఆ రోజుల్లో నేను బిందుగారి కత్యంత సన్నిహితుణ్ణి ... బిందుగారి చేత ఆపని చేయించి పెట్టిన తృప్తి నాక్కలిగింది.

*[ఆ సమయంలో వరదరాజేశ్వరరావు గారు హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్‌కు పబ్లిసిటీ సెక్రటరీ గా పనిచేస్తూ, స్టేట్ కాంగ్రెస్ తరఫున 'హైదరాబాద్ ఎఫెయిర్స్' అనే సైక్లోస్టైల్డ్ పత్రికకు సంపాదకత్వం వహించారు.]*

# Hyderabad Affairs

Number One--- September 15, 1950.

In this Issue:
Congress Chiefs in Conference.
Three Years of Independence.
Our Ministers at Work.
Lest We Forget.
Reports from Districts.

..... In a democracy, the responsibility of the people is greater than of the Government, for latter is of the people and therefore Government effort will be successful only when the people realise the need and are conscious of the discharge of responsibility.

Democracy is itself a guarantee of the people's undivided sovereignty and sovereignty or power is more or less synonymous with responsibility.....

State Congress President
in his broadcast to the people
on 15th August 1950.

Issued By The Hyderabad State Congress

**Urgent**

No. E/12398/L.C ..
Encl. 72412 ..

GOVERNMENT OF HYDERABAD.
Dated/24 October, 1950.

From
The Labour Commissioner,
Government of Hyderabad,
Hyderabad-Deccan.

To
Shri Rajeshwar Rao,
C/o. Hyderabad State Congress,
Sultan Bazar, Hyderabad.

Subject: Training of Trade Union Workers.

Dear Sir,

With reference to your letter No. __________ dated ______. I am herewith enclosing a copy of the time table for your information. As desired the timings of the lectures have been fixed to suit your convenience.

The classes will be held at the P.W.D. Seecretariat Hall (Mint Compound) from 25th October, 1950.

After completion of lectures you are requested to kindly prepare the question papers on your subject to be answered in one hours time.

The opening ceremony is being held on 24th October 1950 and an invitation is being sent to you separately.

Yours faithfully,

Sd. [illegible]

Asst. Labour Commissioner.

*

**J.A. Curran, Jr.**
2 Montague Terrace
Brooklyn 2, N.Y.

June 6, 1951.

Mr. A.V. Rajeswara Rau,
C/o. Hyderabad State Congress,
Hyderabad, India.

Dear Rajeswara Rau,

Hope that all goes well with you. You are probably suffering from the hot season at this point, although I do hope that you have been able to take some

rest in a cooler spot.

Work goes on here at a great rate. Have been able to accomplish a good deal so far but much remains to be done. I do hope that by the end of the year things can be arranged so that we can get back to India for another stay. Much of my activity these days has centered around work that has concentrated on trying to explain to interested groups here in the east coast the main trends of Indian public opinion. A great deal of time has gone into an effort to explain and to emphasise the tremendous desire among Indians for independence of action both internally and externally. Americans as you know are becoming increasingly aware of and interested in India and what she is going to do. Although there is a good deal of criticism of Indian foreign policy among our press and among a certain percentage of public opinion, many people and an increasing section of the press are beginning to take a more realistic viewpoint, a viewpoint that wants as much information on India as possible, so that we in the States will back the proper policies, policies that both Indians and Americans can agree upon. It will take time but I do think that things will work out in time.

How goes things with you? If you do get the chance please drop me a line. It would be nice hearing from you. When you get the chance please give my best regards to Mr. Bindu, Mr. Ramchandra Rao, Mr. Raju and Mr. Desai. I do hope that they are all well and that affairs are progressing to their liking.

Enclosed are some pictures taken during the trip we made when last we were in your part of the country. Hope you like them.

Hoping that you are well, I remain,

Sincerely,

J.A. Curran, Jr.

J.A. Curran, Jr.

## సెడ్ ది సర్దార్

*[1950 లో 'గాంధీభవన్' కు శంకుస్థాపన చేయటానికి ఆనాటి కేంద్రహోంమంత్రి సర్దార్ వల్లభభాయ్‌పటేల్ హైదరాబాదు వచ్చిన సందర్భాన్నీ, శ్రీ పటేల్ 75వ జన్మదినం సందర్భాన్నీ పురస్కరించుకుని "Said the Sardar" అనే గ్రంథాన్ని వరదరాజేశ్వరరావు గారు హైదరాబాదు రాష్ట్ర కాంగ్రెస్ తరపున సంకలితం చేసి ప్రచురించారు.]*

['గాంధీ భవన్' నిర్మాణం జరుగుతుండగా- కాంగ్రెసు నాయకులతో 'వరద']

## ఉద్యోగం విషయమై

*[వరదరాజేశ్వరరావు గారి ఉద్యోగ పరిస్థితి గురించి - అనిశ్చిత స్థితిగతుల గురించి తండ్రి కొంత ఆందోళన చెందినా, కొడుక్కి ధైర్యం చెప్పేవారు.]*

Waltair
Nov 20, 1950

My dear Varada,
... but this is the pitiable financial condition at the moment.
I see that you are making a gallant effort to get into some established journal. You have all the qualifications and friends in high quarters but are dogged by bad luck all through. I hope it will all turn out well soon. Iswara Dutt and his son also are it seems in the Hindustan Times. I do not know on what terms, if at all, you will be taken. Make sure you have an honourable even if a humble place
You must be having a strenuous time both mentally & physically in your present situation. I am anxious that you should make every effort not to lose your hold on the fundamentals of life. You are by nature capable of high endeavour and have the necessary equipment which you must of course constantly replenish. Do not lose faith in yourself. Let not the essential refinement of your nature suffer through the ugly turns of fortune. Your literary bent requires assiduous cultivation whatever unfavourable circumstances confront you at present. You may be making all kinds of compromises now but a time will come when you can live on your own terms if only you are true to yourself all through. So always aim at the best. Above all else take the greatest care of your health ....
we are all well.

Yours affectionately

[Abburi Ramakrishna Rau]

## ఫెడరేషన్ ఆఫ్ ఇండియన్ వర్కింగ్ జర్నలిస్ట్స్

[ఫెడరేషన్ ఆఫ్ ఇండియన్ వర్కింగ్ జర్నలిస్ట్స్ నేషనల్ ఎగ్జిక్యూటివ్ సభ్యులలో హైదరాబాదు ప్రతినిధిగా వరదరాజేశ్వరరావు గారు నియమితులయారు.]

## WORKING JOURNALISTS' FEDERATION

Lucknow, Nov. 23

Mr. M. Chalapathi Rau, President of the Federation of Indian Working Journalists, has nominated the following to form the National Executive of the Federation:

Messrs. Banarsi Das Chaturvedi (Vindya Pradesh), N. Raghunatha Aiyar (Madras), A.C. Bali (Punjab), M.V. Sane (Bombay), K. Rama Rao (Bihar), Hukumchand Narad (Madhya Pradesh), Jang Bahadur Singh (Delhi), M. Harris (Bombay), Poorna Chandra Jain (Rajasthan), K. Iswara Dutt (Delhi), C. Parameswaran (Travencore-Cochin), Nandalal Aish (Punjab), A.V. Rajeswara Rao (Hyderabad), Srikant Thakur (Bihar), C.S. Mahapatra (Orissa), K.S. Ramaswami (Madras), Tarachand Gupta (Pepsu), A.K. Ganguli (Delhi), C. Himkar (West Bengal), C.V. Hanumantha Rao (Madras), S. Patwardhan (Madhya Pradesh), U.G.Rao (Bombay), T. Fernandez (Delhi, Treasurer), J.P. Chaturvedi (Delhi, Secretary), Jwala Singh (U.P. Secretary).

Mr. Chalapathi Rau was authorised by the recent All-India Convention of Working Journalists to nominate a provisional executive to carry on the work of the Federation. —UPI.

(The Hindu, Saturday, November 25, 1950).

## INDIAN FEDERATION OF Working Journalists' Organizations

(HEADQUARTERS, NEW DELHI)

President:
Mr. M. Chalapathi Rau.

Secretaries
Mr. Jwala Singh, (Lucknow).
Mr. J. P. Chaturvedi, (New Delhi).

Treasurer.
Mr T. Fernandez, (New Delhi)

ASSOCIATED JOURNALS' BUILDING,
Kaiserbagh, Lucknow Oct. 8, 1951.

My dear Rajeswara Rau,

I write to thank you for your letter dated September 19. I am extremely sorry for this delay. I thank you and other members of the Hyderabad union for asking me to preside over your session. But I am afraid it will not be possible for me to get away for the next few months. It will also not be feasible to convene a meeting of the federal executive committee at Hyderabad, as

most members feel that they have been already, a bit, financially bitten on account of the work of the federation. The problem of funds remains and I hope it will be possible for you to do something about it. In any case, I would suggest you should keep in touch with Mr. J.P. Chaturvedi, secretary-general of the federation, 15 Windsor Place, New Delhi, about holding a session of the federal executive in Hyderabad, if not now, some time later. There are two vice-presidents and even if I shall not be available, one of them can preside.

With regards,
Yours sincerely,

M. Chalapathi Rau

A.V. Rajeswara Rau Esq.,
12, Gulbagh, Hyderabad.

## నెహ్రూతో ప్రెస్ కాన్ఫరెన్స్

[నెహ్రూతో ప్రెస్ కాన్ఫరెన్స్‌లో 'వరద']

## జ్ఞాపకాల వరద

# నగరం వయసు నాలుగువందలయేళ్లు!

హైదరాబాదు రాష్ట్రంలో ప్రజాస్వామిక ప్రభుత్వం యేర్పడ్డ అనతికాలంలోనే ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ ఒకసారి నగరానికి వచ్చారు. లేక్‌వ్యూ అతిథిగృహంలో ఉన్నారు. ఆ అవకాశాన్ని పురస్కరించుకుని పత్రికా విలేఖరులం కొంతమంది ఆయన్ని చూడటానికి వెళ్లాము. అయితే అనుకోకుండా జరిగిన విలేఖరుల గోష్ఠిలో నేనాయనతో ఘర్షణ పడ్డాను. హైదరాబాదు రాష్ట్రాన్ని భాషాప్రయుక్తంగా మూడు ముక్కలు చేసి ఆయా రాష్ట్రాల్లో విలీనం చెయ్యడం మంచిదికదా అన్న విషయం గోష్ఠిలో ప్రస్తావనకు వచ్చింది. నెహ్రూగారు అలా చెయ్యడం మంచిదికాదనీ, హైదరాబాదు రాష్ట్రానికే శ్రేయస్కరంకాదనీ అన్నారు. ఎంచేతనని, నేను గట్టిగా అడిగాను. హైదరాబాదు నగరం సమ్మిశ్ర సంస్కృతికి కేంద్రం అనీ, ఆ సంస్కారాన్ని నిలబెట్టవలసిన అవసరం ఉందనీ అన్నారు. నాకెదురుగా కూచున్న నీలకంఠ్ (తరువాత టైమ్స్ ఆఫ్ ఇండియా సంపాదకుల్లో ఒకడయినాడు) భాషా ప్రయుక్తరాష్ట్రాలు కావాలనీ, హైదరాబాదు విభజితంకావాలనీ ప్రజలు కోరుతున్నారు కదా అన్నాడు. నెహ్రూగారు గొంతు పెద్దదిచేసుకుని "ప్రజలు పొరబడితే దిద్దే బాధ్యత మనది" అన్నారు. నేనన్నానూ, ప్రజలంతా ముక్తకంఠంతో అలా జరగాలనికోరితే మీరు అనుమతించక తప్పదు కదా అని. "అలా కుదరదు. ప్రతీ తలుపూ తట్టి మీరు చేసేది మంచి పనికాదు అని నేను చెబుతాను. హైదరాబాదు రాష్ట్రాన్ని యథాతథంగా వుంచేట్టు ప్రయత్నిస్తాను" అన్నారు. నాకు కొంచెం కోపం వొచ్చింది. పక్కన ఉన్న మిత్రుడు పణిక్కరు (పి.టి.ఐ.) వారిస్తున్నా "అలా మీరు చేస్తే భారతప్రధానికీ వెనకటి నిజాంకు యేమిటిభేదం" అన్నాను. నెహ్రూగారి ముఖం కోపంతో ఒక్కసారి యెర్రపడింది. బల్లమీద ఉన్న సిగరెట్టు డబ్బా నేలకేసి కొట్టారు. ఆయన ఇంగ్లాండులో తయారుచేసిన బ్లాక్ అండ్ వైట్ సిగరెట్లను కాల్చేవారు. నేను లేచి ఆ డబ్బాతీసి ఆయన బల్లమీద పెట్టాను. నావంకచూసి గట్టిగా నవ్వుతూ "నేను చెప్పింది జాగర్తగా ఆలోచించండి" అంటూ లేచారు. అంతటితో గోష్ఠి అయిపోయింది. అందరం లేచి నిలబడ్డాం. ఆయన పక్కన చేరి నేనన్నానూ "పండిట్‌జీ! సమ్మిశ్ర సంస్కృతి అంటారే అది ధర్మబద్ధమా?ఓ విదేశస్థుడు ఒక రాజ్యాన్ని బలవంతంగా ఆక్రమిస్తాడు. ఆత్మశ్రేయస్సు కోసం అక్కడి భాష కొంచెం నేర్చుకుని కాలక్రమంగా వాళ్లనెత్తిమీద తన జాతి సంస్కారాన్నీ భాషనీ రుద్ది ఆఖరికి మతపరంగా కూడా మార్చు తేవాలని చూస్తాడు. అలాంటి ప్రయత్న ఫలితం సమ్మిశ్ర సంస్కృతి అని మేమనుకుంటున్నాము. ఒకంతట ఆభావం పోదు". నెహ్రూ గారు నావంకచూసి 'ఓహో' అంటూ తానుచెప్పిన దాంట్లో అంతరార్థం అది కాదనీ, ఉన్న పరిస్థితి దృష్ట్యా మాట్లాడుతున్నాననీ అన్నారు. మాతోపాటు ఆరుబయటికి వచ్చి అందరివంకా చూస్తూ వెనక్కి వెళ్లిపోయారు.

తరువాత కొన్నాళ్లకు 1955లో ననుకుంటాను భారత సేవకసమాజ సాంవత్సరిక సమావేశం నిజాంబాదులో జరిగినప్పుడు హైదరాబాదు రాష్ట్రాన్ని మూడు భాగాలుగా విభజించి ఆపక్క రాష్ట్రాల్లో విలీనం చేసేందుకు ప్రభుత్వం నిర్ణయించినట్టుగా నెహ్రూ గారు ప్రకటించినప్పుడు

రాజకీయవాదులు విస్మయచకితులయ్యారు.

ఈ మధ్య హైదరాబాదు నగర చతుశ్శతాబ్ది సంవత్సరంగా ఓ ఉత్సవాన్ని నిర్వహించే ప్రయత్నం కొందరు చేస్తున్నారు. నగరం మత సామరస్యానికీ, సమ్మిశ్ర సంస్కృతికీ ఆదర్శ దర్పణమంటూ నిర్వాహకులూ, తెలుగురానివారూ ప్రచారం చేస్తున్నారు. ప్రచారంలో తప్పులేదు. ప్రతి యేటా యథార్థం వేరుగా ఉంటోంది.

ఈ నగరం వయస్సు నాలుగువందల సంవత్సరాలయితే అందులో రెండు వందల సంవత్సరాలపైగా అసఫ్‌జాహీ వంశస్థుల పాలనలో కదా ఉన్నది! ఈ వంశస్థుల పాలన కింద ఉన్నప్పుడే ఏనుగుల వీరాస్వామి గారి కాశీయాత్ర కూడా జరిగింది. ఆయన తెలంగాణాప్రాంతం, హైదరాబాదు నగరంలోనూ విడిదిచేసి పోయారు. ఆనాటి రాజకీయ పరిస్థితి కన్నులకు కట్టేటట్టుగా అక్షరబద్ధంచేసి పోయారు. వీరాస్వామిగారి గ్రంథంలోని కొన్ని విశేషాలను ఉదాహరిస్తూ అవి సత్యదూరంకావంటూ మిత్రులూ, మాన్యులూ, సురవరం ప్రతాపరెడ్డిగారు తమ 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర'లో రాశారు మత సామరస్యం దేవుడెరుగును, శాంతి భద్రతలే శూన్యం! ప్రజల దోపిడీ ప్రధానం!

అంతకు పూర్వం యే ఒకరోయిద్దరో, సుల్తానులో, పాదుషాలో-తెలుగు నేర్చుకుని తెలుగుభాషని తమ ఆస్థానాల్లో ఆదరించారని వింటాం. అదీ ఓ కంటితుడుపే. తెలుగుభాషకీ, సంస్కృతికీ మహోపకారమేమీ జరగలేదు. అసఫ్‌జాహీ వంశస్థులు అధికారానికి వచ్చినప్పట్నించీ తెలుగుభాషకి అపకారమే జరిగింది. నగరంలో మరీను! కమ్యూనిస్టులూ, కాంగ్రెస్ వాదులూ, యితర దేశభక్తి పరాయణులూ అసఫ్‌జాహీ దుష్టపరిపాలనకు స్వస్తి పలికించేందుకు మహత్తరమయిన త్యాగాలు చెయ్యవలసి వచ్చింది. నగర చతుశ్శతాబ్ది ఉత్సవంల్లో రాజకీయ బాధితులూ, స్వాతంత్ర్య సమర యోధులూ యేరూపంలో దర్శనమిస్తారో చూడటానికి చాలామంది ఉత్సాహంతో యెదురు చూస్తున్నారు.

నగరం పేరూ సందిగ్ధంగానే ఉంది. బాగామతి అనే ఆమె ఉందో లేదో తెలీదు. ఆవిడ మతాన్ని మార్చి హైదర్‌మహల్ అనే పేరుతో పాదుషా వారు ఉంచుకున్న వైనమూ సందేహాస్పదమే. చారిత్రికంగా దాఖలాల్లేవంటారు విజ్ఞులు. ఉన్నా తెలుగువారికేమంత ఆత్మగౌరవం? నిజంగా మతసామరస్యం ఉంటే బాగామతిగానే ఆవిణ్ణి ప్రేమించి ఆవిడ సంస్కారాన్ని గౌరవించవలసి ఉండెను పాదుషా!. అలా జరగలేదు. అలా జరక్కపోవటమే సమ్మిశ్ర సంస్కృతికి ప్రాథమిక చిహ్నం కాబోలు! ఒక విధంగా యిదంతా వ్యర్థవిచారమే అనుకోండి. కాకపోతే యీ ఉత్సవాలకు యింత ఆడంబరమూ, వ్యయమూ చెయ్యవలసిన అగత్యం కనిపించదు. కుహనా లౌకికవాదుల దురవగాహనవల్ల యిలాంటి పరిస్థితులేర్పడుతుంటాయి.

దుర్గంధభూయిష్టమయిన నగరాన్ని పరిశుద్ధంగా, ఆరోగ్యదాయకంగా తీర్చిదిద్ది, రహదారుల్నీ వాటిని ఆశ్రయించుకున్న సందుల్నీ బాగుచేయించి, జనజీవనాన్ని నిరపాయకరంగా నిర్వహించటమే నిజమైన సంస్కృతి. ఇందుకు పండిత జవహర్‌లాల్ నెహ్రూ కూడా కాదనలేరు!

('సుప్రభాతం,' 20 నవంబర్, 1991)

# అబ్బూరి ప్రశ్నకు అబ్బురపడ్డ నెహ్రూ!

**జి. కృష్ణ**

నిశీధిని పండిట్ నెహ్రూ ప్రెస్ మీట్ ఎక్కడ? హైదరాబాద్‌లో.

స్థలం? కుమారి పద్మజానాయుడు నివాస గృహం.

(నెహ్రూ ఎప్పుడు హైదరాబాద్ విచ్చేసినా బస అక్కడే)

సందర్భం: 1951 సార్వత్రిక ఎన్నికలలో కాంగ్రెస్ విజయం కోసం ప్రచారోద్యమం నెహ్రూ సోదరీమణి శ్రీమతి విజయలక్ష్మీ పండిట్ కూడా హాజరు.

పగలంతా పర్యటనలో గడిపారు నెహ్రూ. తెలంగాణాతోపాటు పూర్వపు హైదరాబాద్ రాష్ట్రంలోని కర్నాటక, మరాట్వాడా ప్రాంతాలలోని ప్రధాన పట్టణాలను విమానంలో సందర్శించి బ్రహ్మాండమైన బహిరంగ సభలో ఆయన ప్రసంగించారు. అయినా కందినట్టు, అలసినట్టు చిహ్నాలు కనిపిస్తే ఒట్టు.

కాకతీయ రాజధాని ఓరుగల్లు (వరంగల్) నెహ్రూ పర్యటన సందర్భంగా కానవచ్చిన ఉత్సాహభరిత దృశ్యాలు వర్ణనాతీతం.

తెల్లని పైజామా, మోకాళ్ళు తాకే తెల్లని షెర్వానీ వేసుకొని, హృదయసౌరభ చిహ్నంగా ఎడమవైపు జేబులో ఎర్రని గులాబీ పెట్టుకొని, చిరునవ్వు చిందిస్తూ నిటారుగా నిలబడి జీపులో నెమ్మదిగా సాగిపోతుంటే ఆ స్ఫురద్రూపిలో చక్రవర్తి ఠీవి ఉట్టిపడింది. కాని ఆయన చక్రవర్తి కారు. అటువంటి తత్వం ఆయనలో ఏకోశానా లేదు. మరి ఏమనాలి నెహ్రూను? మహానాయకుడా! ప్రియతమ నాయకుడా! అబ్బే! ఇవన్నీ మామూలు దంపుడు పదాలే. ఇకపోతే తులాభారంలో సరిపోయే పదం 'ప్రజాస్వామ్య పాదుషా' దర్జానుబట్టి పాదుషా. గుణాలను బట్టి ప్రజా నాయకుడు. నాడు చూడటానికి వచ్చిన అశేష జనవాహిని దృష్టిలో మాత్రం నెహ్రూ దివి నుంచి భువికి దిగివచ్చిన దేవదేవుడే. వరంగల్ రాజవీధుల కిరువైపులా బారులుతీరి గంటల తరబడి ఆయన రాకకై నిరీక్షించిన వేలాది స్త్రీ పురుషుల నయనాలలో ఆరాధనా భావం తొణికిసలాడింది. తమ భవిష్యత్తును సంపూర్ణ విశ్వాసంతో ఆయన చేతుల్లో పెట్టడానికి సిద్ధం అన్నట్లుగా మిన్నుముట్టేటట్లు హర్షధ్వానాలు చేశారు తెలంగాణా ప్రజలు.

నెహ్రూను చూస్తే ప్రజలకు ఎంత పూనకం, ఆనందం కలిగేవో జన సమూహాలను చూస్తే ఆయనకు అంతే ఉత్తేజం, తన్మయత్వం చేకూరేవి. జనమే నెహ్రూకు బలం.

స్వాతంత్ర్య సమరకాలంలో నెహ్రూ బెబ్బులి. జాతీయ వేదిక ఆయన గర్జనతో దద్దరిల్లేది. బ్రిటిష్‌ప్రభుత్వంపై, సామ్రాజ్యవాదులపై ఆయన నిప్పులు కురిపిస్తుంటే జనంలో రోషావేశాలు పెచ్చరిల్లేవి. బ్రిటీష్‌పాలనకు వ్యతిరేకంగా వీరోచిత పోరాటం ఆనాటి కర్తవ్యం. కాని ప్రజాభ్యున్నతికై దేశ పునర్నిర్మాణం స్వాతంత్ర్య సముపార్జనానంతర కర్తవ్యం. ఆ నెహ్రూ వేరు. ఈ నెహ్రూ వేరు.

ఈ అవతార భేదానికి వరంగల్ బహిరంగ సభలో ఆయన ప్రసంగం దర్పణం పట్టింది. ప్రజలు

of unity and association. I continued to meet him of and on when my work as Director of Information, Public Relations and Tourism, A.P. Government took me to Delhi. When he returned to Hyderabad he and his wife did call on me to tell that they would be in Hyderabad in their own flat in Lingampally. I must confess that while I did not lose touch with him and his wife completely, my work in a different field deprived me of that consanguinity which I had before his departure to North. He was obviously pleased when I published two poems from Modern Telugu Poetry, an anthology edited by Chaya Devi in New Swatantra duly acknowledged. In the April issue which I sent him, I had published a poem by his father and footnote about his appointment as Chairman of the official Language Commission.

While I got briefed about his health daily during the period he was in hospital, I could see him only once and it was after a long gap. He was pleased to see me, an old friend. He was all smiles but could not express himself except by signs. When I reminded him of some of his humorous pet expressions of old days, he replied with a smile. It was as if memories of the past when we moved closely with me for 10 years rushed to his mind. He held my band and released when I rose to leave, which touched the inner core of my heart. His wife showed him the journal in which there was reference to him, saw it apparently happy. I took it he was convalescing and would be back home, even if he was unable to work. Fate willed otherwise. He was one of my best well-wishers. I was among the few who attended his funeral on a hot afternoon. It was fitting that he was given state honours for which the Chief Minister should be thanked as it was symbolic of the respect shown to the class of journalists, writers, poets and scribes as a whole. As the flames went up, the irresisitible feeling which came to my mind, was as if he had tarried on this planet for recognition and such honours, a feeling which is shared by the Chief Minister.

Rajeswara Rau's death removes from our midst a fine specimen of a gentleman, a journalist of his own vintage and a poet and a writer of his own individual stamp. At a time when we all expected, after his assumption of office as Chairman of Official Language Commission, that he would bring a new life into it, he was taken away from us, leaving us the poorer.

***[SPEECH DELIVERED AT THE CONDOLENCE MEETING HELD ON 2-6-93 AT PRESS CLUB, HYDERABAD UNDER THE AUSPICES OF FORUM FOR FREEDOM OF EXPRESSION.]***

## వ్యక్తి
# వరదల్లో ముడిపడిన 'వరద'తో

అబ్బూరి ఛాయాదేవి

పీటల మీద కూర్చున్నాక కూడా నాకు అనుమానమే–ఆయన నన్ను ఇష్టపడే చేసుకుంటున్నారా. స్నేహితుల బలవంతం మీదనా అని. మాది స్నేహితులు కుదిర్చిన సంబంధం. ఆయన స్నేహితులు నాకు ఆలిండియా రేడియో (హైదరాబాదు)లో పరిచయస్థులు.

పెళ్ళి చూపులకు వచ్చినప్పుడు నాకేసి ఒకసారి చూసీ చూడనట్లు చూశారు–పరిచయం చేస్తున్నప్పుడు. స్నేహితులతో కలిసివచ్చారు. మా అన్నయ్యతో బాగానే మాట్లాడారు. ఆంధ్రయూనివర్సిటీలో వాళ్ళిద్దరూ ఒకే కాలంలో చదువుకున్నారట. ఆనాటి కబుర్లు చెప్పుకుంటూ నవ్వుకున్నారు. వెళ్లేటప్పుడు కూడా ఆయన నాకేసి చూడలేదు. ఇష్టంలేదేమో అని ఆశవదులుకున్నాను.

రెండు రోజుల తరవాత, స్నేహితుడు భాస్కరభట్ల కృష్ణారావుగారి ద్వారా కబురుపెట్టారు. ఆ రోజున సరిగ్గా చూడలేదు, మళ్ళీ ఒకసారి చూడాలి. కృష్ణారావుగారింటికి ఫలానా రోజున ఫలానా టైముకి తీసుకురాగలరా అని. మాఅన్నయ్య నన్ను అక్కడ దిగబెట్టి వెళ్లిపోయాడు–వాళ్ళు నన్ను తిరిగి ఇంట్లో దించుతామన్నారని.

మమ్మల్నిద్దర్నీ డ్రాయింగ్ రూమ్‌లో ఒంటరిగా వదిలి, కృష్ణారావుగారూ, మరో స్నేహితుడూ వీధి వరండాలోకి వెళ్ళిపోయారు. ఇద్దరం నిశ్శబ్దంగా కూర్చున్నాం గదిలో చుట్టూ ఉన్న వస్తువుల్ని గమనిస్తూ–ఆయన మాట్లాడతారని నేనూ, ఏం మాట్లాడాలో తెలియనట్లు ఆయనా. ఆ ఇంట్లో పిల్లలు తలుపు సందులోంచీ, కిటికీ పక్కనుంచీ తొంగి చూస్తున్నారు కుతూహలంగా. పదిహేను

నిముషాలు దాటినా చడీచప్పుడు లేకపోయేసరికి అనుమానం వేసి, లోపలికి వచ్చారు స్నేహితులిద్దరూ. ఆయన్ని వేళాకోళం చేస్తూ నవ్వుకున్నారు.

తీరా పెళ్ళికి ముహూర్తం పెట్టాక గోదావరి లో వరదలు! పెళ్లి రాజమండ్రిలో. పెళ్ళివారు వస్తారా, రారా అని భయం!

పెళ్లి తంతు మధ్యలో నేను పీట మీంచి లేచి ప్రదక్షిణం చెయ్యవలసి వచ్చింది. తిరిగి పీట మీద కూర్చోబోతూంటే కింద జారిపడిన నా చేతిరుమాలుని తీసి నా చేతికిచ్చారు ఆయన. అప్పటికి నాకు నమ్మకం కుదిరింది. ఆయన నన్ను ఇష్టపడే చేసుకుంటున్నారని! ఆయన చర్యకి మురిసి పోయాను కూడా.

పెళ్లికి ఆయన కట్నం అడగలేదు. ఏ విధమైన కానుకలూ ఆశించలేదు. పైగా, తన తల్లిదండ్రులచేత కూడా ఏమీ ఖర్చు పెట్టించకూడదని, అన్నిటినీ తనంతట తనే ఏర్పాటు చేసుకుని, నాకోసం బోలెడు పట్టు చీరలు కూడా పట్టుకొచ్చారు. తన ఇంటికి కావలసిన వస్తువులన్నిటినీ తనే ముందుగా ఏర్పాటు చేసుకున్నారు. బాజా భజంత్రీలతో అట్టహాసంగా పెళ్లి చేసుకోవడం ఆయన కిష్టం లేదు. అనుకోకుండా 'వరదల' మూలంగా అలాగే జరిగింది మాకు. సరిగ్గా నలభై సంవత్సరాల క్రితం ఇలా ప్రవర్తించడం అబ్బురమే! ఈ విషయంలో ఈనాటి యువకులందరూ అనుసరించదగిన మార్గదర్శి వరద రాజేశ్వరరావుగారు.

ఆ రోజుల్లో 'బిర్లా' కంపెనీలకు హైదరాబాదులో "పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసర్‌గా' పని చేసే వారాయన. రాత్రీ, పగలూ క్షణం తీరికలేకుండా తిరిగే వారు. పైగా అనేక మంది మిత్రులు-సాహితీరంగంలోనూ, రాజకీయ రంగంలోనూ. నిత్యం వారి రాకపోకలతో నాకూ తీరిక లేకుండా పోయినా, నాకంటూ ప్రత్యేకంగా ఏదో వ్యాపకం ఉండాలనీ, ఏదో ఇంకా సాధించాలనీ తపన ఉండేది నాకు.

అది గమనించి, ఆయన నా అభివృద్ధికి ఎంతో దోహదం చేశారు. సాహిత్యంలో నాకు అభిరుచి ఉన్నదని తెలుసు కనక "కవిత' పత్రికకీ, 'మోడర్న్ తెలుగు పోయెట్రీ' గ్రంథానికీ నన్ను సంకలన కర్తగా ఉంచి, తాను 'సారథ్యం' వహించారు. నా చేత మంచి పాశ్చాత్య రచనలు కొన్ని చదివించారు. కొన్నిటికి తెలుగు అనుసరణ చేయమని ప్రోత్సహించారు. అవి అచ్చయే అవకాశాలు కల్పించారు. నేను ఏ పని తలపెట్టినా తన చేతనయిన సహాయం చేసేవారు.

నాకేకాదు. ఆయన మిత్రులకు కూడా–అనేక రకాల కార్యక్రమాలు ఎలా చేపట్టవచ్చునో వివరంగా సూచించేవారు, సలహాలిచ్చేవారు. తనకున్న పరపతినంతా వినియోగించి సహాయపడేవారు.

నన్ను ఉద్యోగంలో చేరమని సలహాఇచ్చి, నాచేత లైబ్రరీసైన్స్ చదివించి, నేను ఉద్యోగంలో చేరేలాగ ప్రోత్సహించారు.

పిల్లలుంటే బావుండేదని నేను ఎప్పుడైనా అంటే, "లెనిన్‌కి పిల్లల్లేరు, ఎం.ఎన్. రాయ్‌కి పిల్లల్లేరు, మనకి మాత్రం ఎందుకు" అనేవారు. లేకపోవడమే గొప్ప అన్నట్లు మాట్లాడేవారు. చెల్లెళ్ళనీ, తమ్ముళ్ళనే సొంత పిల్లలుగా చూసుకునేవారు.

ఎటువంటి పరిస్థితిలోనైనా ఉన్నతంగా ఆలోచించేవారు. ఎటువంటి సమస్యనైనా తేలిగ్గా తీసుకున్నట్లు హాస్యోక్తులాడేవారు. 1975లో ఢిల్లీలో వెల్లింగ్‌టన్ హాస్పిటల్లో 'ఎమర్జెన్సీ వార్డ్'లో ఉన్నారాయన కొద్దిరోజులు. తరవాత స్పెషల్ రూమ్‌కి వచ్చాక, స్నేహితులు పరామర్శిస్తూంటే, "నేనే కాదు, మన దేశమంతా 'ఎమర్జెన్సీ' లోనే ఉంది కదా!" అన్నారు నవ్వుతూ.

ఎవరైనా ఆయన్ని మీ "హాబీ" ఏమిటని అడిగితే, "హాస్యోక్తి" అని సమాధానమిచ్చేవారు. ఆయన చతుర సంభాషణ వల్లనే ఎంతోమంది చిన్నలూ, పెద్దలూ ఆయన పట్ల ఆకర్షితులయేవారు.

ఇంగ్లీషులోనైనా, తెలుగులోనైనా మాటల్ని ఆటపట్టించి నవ్వించేవారు. అందుకే ఆయన్ని ఒకరు "పన్‌డిట్" అని చమత్కరించారు.

ఈ మధ్య ఆసుపత్రిలో ఆధునిక వైద్యం పేరుతో జరిపిన చిత్రహింస భరించలేక, నీరసించి క్రుంగిపోతుంటే, "మీకు 'విల్‌పవర్' ఉండాలండీ, అప్పుడే తొందరగా కోలుకుంటారు" అన్నాను. 'బిల్‌పవర్' కూడా ఉండాలి ఇక్కడ అని రాశారు చిన్న నోట్‌బుక్‌లో (ముక్కులో గొట్టాలు దూర్చి ఉంచడం వల్ల మాట్లాడలేకపోయేవారు.)

మాట్లాడకుండా ఉండటం ఆయన తత్వానికే విరుద్ధం. నా మీద కోపం వచ్చినా ఎక్కువసేపు మాట్లాడకుండా ఉండలేకపోయేవారు! ఎదురుగా ఎవరూ లేకపోతే ఫోన్‌లో మాట్లాడుతూ ఉండేవారు. అందరినీ వేళాకోళం చెయ్యడం, హాస్యపూరితంగా వెక్కిరించడం ఆయన అలవాటు.

"రాజేశ్వరరావు తెనాలి రామకృష్ణుడు లాంటివాడు. ఎవర్నీ 'స్పేర్' చెయ్యడు!" అన్నారు రావిశాస్త్రిగారొక సారి నవ్వుతూ

ఆయన అభిరుచులకూ, అభిప్రాయాలకూ అనుగుణంగా లేని వారినెవరినైనా విమర్శించడానికి వెనుకాడేవారు కాదు. 1978-79లో వాళ్ల నాన్నగారు తుంటి ఎముకవిరిగి మంచం మీద ఉన్నప్పుడు అయిన 'బెడ్‌సోర్' మానడానికి 'రబ్బరు రింగ్' ని పెట్టారు నడ్డికింద. పుండు మాని పోయిన తరవాత ఆ రింగ్‌ని తీసెయ్యబోతూంటే, "వద్దు, అలాగే ఉండనీ" అన్నారు మామగారు. వెంటనే రాజేశ్వరరావు గారు "ఏం, రింగ్ రంగా మని పడుకుందామనా?" అన్నారు నవ్వుతూ.

మా పెళ్లయిన కొత్తలో ఒక రోజున నా ముస్తాబు చూసి "మీ నాన్న 'చింతామణి' వేషం వేసినట్టుంది!" అన్నారు పకపక నవ్వుతూ. ముస్తాబు మార్చక ఏంచేస్తాను!

ఆయనలో పురుషాధిక్యత ఉండేది. కానీ, అందులో నియంతృత్వం లేదు. హాస్యం తోనూ, ప్రేమతోనూ లొంగదీసుకునేవారు.

ఎలాంటి వారినైనా తనవైపు మొగ్గేటట్లు చేసుకోగలిగే వారు. అటువంటి ఆకర్షణీయమైన వ్యక్తిత్వం ఆయనది. గిరీశం అన్నట్లు, ఆయనతో 'మాట్లాడ్డమే ఒక ఎడ్యుకేషన్'', ఒక ఆనందం.

రావిశాస్త్రిగారు రాజేశ్వరరావుగారి జోకులకి పడి పడి నవ్వేవారు. ఇంటా బయటా అందరికీ ఆ జోకులు చెప్పి అందరినీ నవ్వించేవారు.

గోపాలశాస్త్రిగారూ, వరద రాజేశ్వరరావుగారూ జోకులు ఇచ్చిపుచ్చుకుంటూ రోజూ ఫోనులో సత్కాలక్షేపం చేసేవారు. ఇంకా ఎందరో మిత్రులతో మాట్లాడుతూ ఉండేవారు. ఇప్పుడు అదే పెద్ద లోపం. ఎంతమంది ఉన్నా ఆయనలేని ఇల్లు నిశ్శబ్దంగా, నిర్జీవంగా ఉన్నట్లుంది.

('ఆహ్వానం', ఆగస్టు 1993)

## అబ్బూరి నా ఆదిగురువు–
## రావి శాస్త్రి జ్ఞాపకాల 'వరద'
### రాచకొండ విశ్వనాథశాస్త్రి

అబ్బూరి వరద రాజేశ్వరరావు నా ఆదిగురువు. నా చివరి గురువు కూడా.

జొనాథన్ స్విఫ్ట్ తన 'గల్లివర్స్ ట్రావెల్స్' అనే పుస్తకంలో, తన యాత్రలో ఒక దేశం వెళ్తాడు. ఆ దేశంలో నూటికో, కోటికో ఒకడు నుదుటి మీద చుక్కతో పుడతాడు. అలా పుట్టిన వాడికి మరింక మరణం లేదు. ఎల్లప్పుడూ బ్రతికే ఉంటాడు. కాని,–ముసలి తనం మాత్రం వస్తుంది. ఆ దేశంలో అటువంటి వాళ్ళతో ప్రజలందరికీ చాలా కష్టం అవుతుంది. వాళ్ళు మాట్లాడే భాష పది వేల సంవత్సరాల క్రిందటిది కావచ్చు., పది లక్షల సంవత్సరాల క్రిందటిది కావచ్చు. వాళ్ళ భాష బోధపడదు. వాళ్ళకోసం ప్రత్యేక చట్టాలు చేస్తారు. అలా పుట్టిన వాళ్ళు కూడా చావు లేదని సంతోషించరు. చచ్చిపోయిన వాళ్ళను ఈర్ష్యతో, అసూయతో, బాధతో 'అయ్యో నాకు చావు లేదే' అని విచారిస్తూ చూస్తారు.

అందుచేతనే కాబోలు అబ్బూరి వరద రాజేశ్వరరావునాతో దాదాపు ఆఖరి సారిగా మాట్లాడుతూ 'ఒరే శాస్త్రీ, బతికున్నవాళ్ళకంటె చచ్చిపోయిన వాళ్ళే అదృష్టవంతులురా, అందుచేత నువ్వు ఏందుఃఖించకు–విచారించకు" అని చెప్పి ఫోన్ పెట్టేశాడు. ఇంతలోనే తను చెప్పినట్టుగా హాయిగా, దర్జాగా, మహారాజులా వెళ్ళిపోయాడు.

1932వ సంవత్సరంలో నాకు పదేళ్ళు. ఎ.వి.ఎన్. కాలేజీ [విశాఖపట్నం] లో ఒక ఏడాది సెకండ్ ఫారమ్ ఫెయిలై, మళ్ళీ ఏడాది చదువుతున్నాను. అప్పుడొక కుర్రాడు–ఎర్రగా ఉన్నాడు. పొట్టకపు మచ్చలతో ఉన్నాడు–వచ్చి, కొత్తగా మా సెకండ్ ఫారమ్‌లో చేరాడు. "ఎవరు నువ్వు" అని అడిగితే, "నేను బెజవాడ నుంచి వచ్చాను" అని గర్వంగా చెప్పాడు–బెజవాడ విశాఖపట్నం కంటే గొప్ప ఊరైనట్టు!

నీ పేరు ఏమిటంటే "రాజేశ్వరరావు" అని చెప్పాడు. నా పేరు నేను చెప్పాను. కొంత సేపు సంభాషణ అయిన తర్వాత ఆ కుర్రాడు [మరి ఏమి సంభాషణ సాగిందో చెప్పలేను]

"దేవుడు లేడు నీకు తెలుసా?" అని అడిగాడు.

"అదేమిటి, దేవుడు లేడు అంటున్నావు?" అన్నాను.

'దేవుడు లేడు" అన్నాడు మళ్ళీ చాలా అధికారపూర్వకంగా. తనకా విషయం స్పష్టంగా తెలిసినట్టుగా మాట్లాడితే నేను దేవుడు లేడని చాలా భయపడిపోయాను. తల్లి, తండ్రి లేని వాడిలాగ ఫీల్ అయిపోయాను. అపుడు ప్రహ్లాదుడు గురించి రహస్యంగా ఒక చిన్న కథ రాస్తున్నాను. అది రాయడం మానేశాను. ఆ తరువాత, "దేవుడుంటే మా చెల్లి ఎందుకు చచ్చిపోవాలి?" అన్నాడు రాజేశ్వరరావు. దాని గురించి నేనొక గేయం రాశాను అన్నాడు. ఆ గేయం ఆ మర్నాడు తెచ్చి చూపించాడు. చదివాడు. నాకు జ్ఞాపకం లేదు.

అప్పట్లో ఎ.వి.ఎన్. కాలేలో ప్రతిక్లాసు ఏడవ తరగతి నుంచి ఎస్.ఎల్.సి. వరకు ఎ.బి.సి. అని మూడు సెక్షన్స్‌లో ఉండేది.

నేను సెకండ్ ఫారమ్‌లో ఉన్నప్పుడు రెండవ భాష ఏమిటో తెలియజేయాలి–తెలుగా, ఒరియానా, ఉర్దూనా, సంస్కృతమా,. ఈ భాషల వారి నందరినీ సెకండ్ ఫారమ్‌లో 'బి' డివిజన్‌కి మార్చేవారు. నేను ఏడవ క్లాసులో రెండవ భాషగా సంస్కృతం తీసుకున్నందువల్ల 'బి' డివిజన్‌కి మారిపోయాను. అబ్బూరి వరద రాజేశ్వరరావు తెలుగులో ఉండడం వల్ల 'ఎ' డివిజన్‌లో ఉండిపోయాడు. కానీ థర్డ్‌ఫారమ్ చదువుతున్నప్పుడు మళ్ళీ అతను కూడా నా డివిజన్‌కి మారాడు. ఎందుకు మార్చారో నాకు జ్ఞాపకం లేదు.

ఒకసారి ఒక మాష్టారు, తెలుగు మాష్టారు అనుకుంటాను అబ్బూరి రాజేశ్వరరావుని కొట్టాట్ట. రాజేశ్వరరావుకి వాణీకుమార్ అనే అన్న ఉన్నాడు. అతను కూడా కాలేజీలో ఫోర్తో, ఫిఫ్తో చదివేవాడు. అతనికి కోపం లావు. అతను క్లాసు అవుతుంటే 'మా తమ్ముణ్ని ఎందుకు కొట్టావు. బయటికి రా, చంపేస్తాను' అని ఆ మాష్టారిని బెదిరించటం, అపుడు క్లాసులో చాలా అల్లరి జరగడం నాకు బాగా జ్ఞాపకం. థర్డ్‌ఫారమ్‌లో మరే విషయాలు రాజేశ్వరరావు గురించి జ్ఞాపకం లేవు. ఫోర్త్ ఫారమ్ వచ్చేసరికి చాలా తెలుగు వక్తృత్వ పోటీల్లో ఎక్కువగా ఇతను [అబ్బూరి] పాల్గొనేవాడు. దాంతో చాలా పాపులర్ అయ్యాడు. సెకండ్ ఫారమ్ చదువుతున్నప్పుడు రాజేశ్వరరావు శ్రీ కన్యకాపరమేశ్వరీ దేవాలయం పూజారి అయిన స్థానాపతి సత్యనారాయణగారి వద్ద సంస్కృతం నేర్చుకున్నాడు. స్థానాపతి సత్యనారాయణ గారు అంటే స్థానాపతి రుక్మిణమ్మగారి భర్త. ఆవిడ "దేవీ భాగవతం" సంస్కృతం నుంచి తెలుగులోకి తర్జుమా చేసింది. అది చదివాకే దేవి చక్కగా కల్లు తాగుతుంది అన్న విషయం నాకు తెలిసింది!

ఫోర్త్ ఫారమ్ చదువుతున్నప్పుడు ఒక చిన్న సంఘటన జరిగింది. దీన్ని బట్టే రాజేశ్వరరావుకి ఉండే అన్ని శక్తుల్నీ కూడగట్టుకునే శక్తి కొంచెం తెలియవచ్చింది.

ఆరుద్ర పినతండ్రి భాగవతుల నారాయణరావు అనే అతను ఉండేవాడు. ఆ రోజుల్లో మున్సిపాల్టీ వారు మామూలు సైకిళ్ళకి కూడా లైసెన్స్....ఆరు నెలలకి రెండు ముచ్చావుక అంటే రెండు ముప్పావలా సైకిలు పన్ను విధించే వారు. రెండు ముచ్చావుకాకి ఆ రోజుల్లో ఇరవై రెండు సేర్ల బియ్యం వచ్చేది. రూపాయికి ఎనిమిది శేర్లు. చాలా మంది జనం సైకిలు పన్ను కట్టలేకపోయేవారు. మున్సిపాల్టీ వారు ఒకసారి భాగవతుల నారాయణరావు సైకిలు పట్టుకున్నారు–లైసెన్స్ లేదని. ఆ భాగవతుల నారాయణరావుగారు ఎవరో మాకు తెలియదు; రాజేశ్వరరావుకి బాగా ఫ్రెండ్. ఆ సైకిలు ఎలాగైనా విడిపించాలని మా అందరి దగ్గర చందా దండి ఫైన్‌తో సహా పన్ను చెల్లించి, ఆ సైకిల్ విడిపించి నారాయణరావు గారికి ఇప్పించాడు. అప్పటి నుంచి నారాయణరావు గారు కూడా మాకు బెస్ట్ ఫ్రెండ్ అయిపోయాడు. అప్పట్లో అంత డబ్బు అందరి దగ్గర వసూలు చేయడం చాలా కష్టమైన పని అన్నమాట. మా అందరి దగ్గర అణా, బేడో తప్ప ఉండేది కాదు. అలా అందరి దగ్గర వసూలు చేసి సైకిలు ఎలాగైనా విడిపించాలని విడిపించాడు.

వక్తృత్వ పోటీల్లో 'అబ్బూరి' మాష్టార్లకి ప్రియ శిష్యుడు అయిపోయాడు. థర్డ్‌ఫారమ్‌లోనే చేబ్రోలు లక్ష్మణరావుగారు, వల్లభజోస్యుల వెంకట నారాయణగారు అనే ఇద్దరు మాష్టర్లు కొత్తగా నియమింపబడ్డారు. ఈ పోటీలంటే వాళ్లకి చాలా ఇష్టం. తరువాత పిక్‌నిక్ లు వేసే వారు. పిక్‌నిక్ ఆర్గనైజేషన్‌లో చాలా యాక్టివ్ పార్టు తీసుకొని రాజేశ్వరరావు వాళ్లకి తలలో నాలుకలా

ఉండేవాడు. రాజేశ్వరరావుకి నాలాగే లెక్కలు రావు. అందుచేత ఫిఫ్త్‌ఫారమ్ ఫైనల్ పరీక్షల్లో లెక్కల పేపర్లో లెక్కలు చేయలేక ఇద్దరం పక్కపక్కనే కూచున్నాం. అప్పుడు లక్ష్మణరావు మాష్టారు గారు అబ్బూరి రాజేశ్వరరావు తనకి అభిమాన శిష్యుడు కావటంచేత దగ్గర కెళ్ళి 'ఏమిట్రా చేస్తున్నావు?' అని రహస్యంగా మూడు లెక్కలో, నాలుగు లెక్కలో అబ్బూరికి చెప్పేశారు.

అబ్బూరికి మాష్టారు లెక్కలు చెప్పటం నేను కనిపెట్టేశాను. నేను కనిపెట్టేశానని మాష్టారు కనిపెట్టేశారు. అపుడు మాష్టారుగారికి దణ్ణం పెట్టి హీనంగా, దీనంగా, నేను కూడా చూసేసరికి ఆయన నాదగ్గరికి వచ్చి "ఏమిట్రా వెధవా నువ్వు చేస్తున్నావు"? అని నాకో మూడు లెక్కలు చెప్పేశారు. దాంతో ఫిఫ్త్‌ఫారమ్ పరీక్షగట్టెక్కేశాం.

తరువాత ఎస్.ఎల్.సి.కి. వచ్చామండి. ఎస్.ఎల్.సి.కి. వచ్చేసరికి అబ్బూరి వరద రాజేశ్వరరావు విజృంభించేశాడు. ఎందుచేతనంటే అపుడు జస్టిస్ పార్టీకీ, కాంగ్రెస్ పార్టీకి 1935 యాక్ట్ కింద ఎలక్షన్స్ వచ్చాయి. మేము కుర్రాళ్ళందరిలో చాలా మంది కాంగ్రెస్ పార్టీకి సపోర్ట్. అప్పట్లో జస్టిస్ పార్టీ మీద పేరు లేకుండా రోజుకొక బులెటిన్ రాసేవాడు అబ్బూరి రాజేశ్వరరావు. ఎవరు రాశాడురా అంటే, తెల్లారేసరికి వచ్చేది అంతే! అవన్నీ దాచి ఉంచితే చాలా బావుండేది. నేను ఎందుచేతనో మర్చిపోయాను. రాజవిక్రమ దేవవర్మ [జయపూర్ రాజా] కాంగ్రెస్ పార్టీని సపోర్టు చేయలేదు. కానీ "జస్టిస్" సపోర్టు కూడా చేశాడనుకోను. కానీ ఎందుకో అతని మీద అబ్బూరికి ఆగ్రహం వచ్చి "తాండం అప్పారావు" అని పేరు పెట్టి ఒక పెద్ద గేయం రాశాడు. అది అప్పట్లో చాలా పాపులర్‌గా ఉండేది. ఆ ఎలక్షన్‌లో మొట్టమొదట ఎవరో 'రామబ్రహ్మం'అనే ఒకాయనని జస్టిస్ పార్టీ కింద నిలబెట్టబోయారు. కానీ బొబ్బిలి రాజావారు జస్టిస్‌పార్టీ లీడరు కాబట్టి ఆయన వచ్చి రామబ్రహ్మం వద్దు, అంకితం బానోజీ అనే ఆయన్ని "నిలబెట్టండి" అని ఆర్డరిచ్చి వెళ్ళిపోయారు. (అయినప్పటికీ రామబ్రహ్మం జస్టిస్‌పార్టీ సపోర్టర్. అతను ఈ షిప్పింగ్ వ్యవహారాలూ అవీ చూసేవాడు. చాలా పెద్ద వాడు.) అప్పుడు రాజేశ్వరరావుకి కోపం వచ్చింది. ఆ రోజుల్లో గోంగూర పాట అవి ఉండేది.

*"నాను ఎల్లకెల్ల కెల్లినాను గోంగూరకీ,*
*తోటంన్ని తిప్పినాడు గోంగూరకీ,*
*దొడ్లన్ని తిప్పినాడు గోంగూరకీ,*
*మాయదారి నాకొడుకే గొంగూరకీ,*

చివరికి *మంచమెక్కమన్నాడే గోంగూరకీ"* అనే ఒక పాటుండేది. ఆ వరుసలో అతని మీద అబ్బూరి ఒక పాట రాశాడు. ఆ పాట ఎలా మొదలు పెట్టాడంటే

"మేడల్ని కట్టావు రామబ్రహ్మం,
మిద్దెల్ని కట్టావు రామబ్రహ్మం,
స్టాండ్ స్టాండ్ అన్నావు రామబ్రహ్మం,
స్టాండేను అన్నావు రామబ్రహ్మం,
కానీ రాజాగారొచ్చేరు రామబ్రహ్మం,
సిట్టు సిట్టన్నాడు రామబ్రహ్మం,
సిట్టేను అన్నావు రామబ్రహ్మం."

అలాగ వెళుతుంది ఆ పాట-చిన్నపాటే. ఆ పాట పట్టుకొని రామబ్రహ్మం ఇంటికెదురుగా కూచొని మా పిల్లల్నందరినీ పోగు చేసి మా చేత రాజేశ్వరరావు పాడించేవాడు. తెన్నేటి విశ్వనాథం అప్పుడు కాంగ్రెస్ కేండిడేటు. జస్టిస్ పార్టీకి వ్యతిరేకం అన్నమాట. అంటే అంకితం భానోజీకి వ్యతిరేకం అన్నమాట.

ఆ పాట పాడేసిన తరువాత "విశ్వనాథంకీ జై, రామబ్రహ్మంకి తుస్" అని కేక. అలాగ కొంతసేపు పాడేసి వెళ్ళిపోయేవాళ్ళం. అప్పట్లో వైశ్యులు చాలామంది కాంగ్రెస్‌కి సపోర్టుగా ఉండేవారు. వైశ్యులు అందరూ చేరి ఒక పాట తయారు చేశారు. అది కొంచెం డాన్స్‌చేస్తూ పాడొచ్చన్నమాట. మా పిల్లలందరం ఆ పాటకి అబ్బూరి వరదరాజేశ్వరరావు లీడర్ షిప్‌లో డాన్స్ చేసేవాళ్ళం. ఆ పాటేమిటంటే,

*"తెన్నేటి విశ్వనాథము మన కాంగ్రెస్ వారండి*
*వారికి తమ ఓటు నిచ్చి ఖ్యాతి నిల్పండి*
*జయమో జయమో విశ్వనాథుకూ*
*జయము గెల్చుటకై ఓటిచ్చి ఖ్యాతినిల్పండి."*

అదీ పాట. మేమందరం డాన్స్ చేసేవాళ్ళం. డాన్స్ చేస్తే ఈ వైశ్యకులంలో కొంత మంది వాళ్ళ ఆడవాళ్ళు చూడాలని వాళ్ళ ఇంటిముందు ఆగి డాన్స్ చేయించేవాళ్ళు మాచేత. అని నేను కనిపెట్టలేదు. కానీ అబ్బూరి రాజేశ్వరరావు మాత్రం "ఒరేయ్! చూశావా, వారి కులం వాళ్ళందరూ చూడాలని మనచేత గెంతిస్తున్నారు" అని కనిపెట్టేశాడు. అపుడు మామూలుగా ముఖ్యమైన కేంద్రాలలోతప్ప అందరి ఇళ్ళ దగ్గర డాన్స్ చేయడం మానేశాము. అపుడు టోపీలు సప్లై (ఖద్దరు టోపీల సప్లై) అన్నీ రాజేశ్వరరావే.

మేము లెక్కల్లో వీక్ కదండి. తరువాత ఎస్.ఎల్.సి.కి వచ్చాక మరింక లాభం లేదని ట్యూషన్ పెట్టుకున్నాం. న్యాయపతి శ్రీనివాసరావు మాష్టారు ఒకాయన ఉండేవారు. ఆయన లెక్కలు చాలా అద్భుతంగా చెప్పేవాడు. ఆయన పాపం, చాలా అమాయకుడు కూడా. ఎంత తెలివైనవాడో అంత అమాయకుడు. అప్పట్లో జస్టిస్ పార్టీకి, కాంగ్రెస్ పార్టీకి ఎలక్షన్స్ కదండి. జస్టిస్ పార్టీ వాడిని అతని అరుగుమీద చంపేశారు. అరుగు మీద చంపేస్తే ఇతను [మాష్టారు] భయపడి పోయాడు. ఇతన్ని పోలీసు సాక్ష్యం వేశారు. అందుచేత ఇతన్ని కొడతారేమోనని భయపడేవాడు. మాష్టారి భయానికి తగ్గట్టుగా "మాష్టారూ, చూశారండీ... ఎవడో ఇపుడు కోపంగా చూసుకుంటూ వెళ్ళాడు" అనేవాడు రాజేశ్వరరావు. అనేసరికి "వీధి తలుపులు ఎందుకు తెరిచి ఉంచారురా, వేసేయండి, వేసేయండి" అనేవారాయన. మాష్టారు గారు మరి కొద్ది రోజులకే ఇల్లు మార్చేశారు. మాష్టారు ఇల్లు మార్చేసి రాజేశ్వరరావు ఇంటి దగ్గరకి వెళ్ళిపోయారు!

అపుడు విశాఖపట్నంలో కొంచెం ప్రతిభ, అందం రెండు కలిసి ఉన్న ఒక పిల్ల ఉండేది. ఆ అమ్మాయిని "డి.హెచ్." అనేవారు. మాష్టారు గారు "ఎబిసి" అనే ట్రయాంగిల్ వేసుకొనుము అనేవారు. అంటే "మాష్టారుగారు, 'ఎబిసి'కి బదులు 'ఎల్.డి.హెచ్.'అని తీసుకోకూడదా!" అనేవాడు అబ్బూరి. మీ ఇష్టం అనేవారు మాష్టారు పాపం అతనికి ఏమీ తెలియక. ఎల్.డి.హెచ్. అనే ట్రయాంగిల్ తీసుకొని రాయించేవారు. ఏరియా ఆఫ్‌ది ట్రయాంగిల్ కర్థం అవి

చెప్పేవాడాయన "ఎల్.డి.హెచ్." అంటే ఏమిట్రా అని అడిగితే "లవ్.డి.హెచ్." అని చెప్పేవాడు అబ్బూరి. మిగతా స్టూడెంట్స్ అందరూ నవ్వుకోవడం. ఆ అమ్మాయిని "డి.హెచ్." అని ఎందుచేత అనే వారో తెలియదు. ప్రతిభ, అందం, తెలివితేటలు ఉన్న మంచి పిల్ల కూడా. చాలా మంచిపిల్ల. అందరి కళ్ళు ఆ అమ్మాయి మీదనే ఉండేవి. అంచేత ఎల్.డి.హెచ్. అని రాయించేవాడు. "లవ్.డి.హెచ్." అని. అలా ఏదో అల్లరి చేస్తుండేవాడు. కానీ మాష్టారు లెక్కలు బాగా చెప్పడం వల్ల నూటిరవై మంది పరీక్షకి వెళ్తే ఫస్ట్‌క్లాసులో పదిహేడు మందిమి పాసయ్యాము. మామిడిపూడి పట్టాభిరాం కూడా మాక్లాస్‌మేటే. ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌కి న్యూస్ ఎడిటర్‌గా చేశాడు. స్పెషల్ కరస్పాండెంట్‌గా 'హిందూ'లో చేరాడు. ఇపుడు డిప్యూటీ ఛీఫ్ ఎడిటర్‌గా ఉన్నాడు 'హిందూ'కి. ఈ లీడింగ్ ఎడిటోరియల్స్ అన్నీ అతనే రాస్తాడు. అతనికి ఆంధ్రాయూనివర్సిటీ వారు డి.లి.ట్ డిగ్రీ ఇవ్వకపోవడం ఆశ్చర్యం. అంతకంటె తక్కువ వాళ్ళకి ఎంతో మందికి సన్మానం చేశారు.

వారిద్దరూ మాకు సెకండ్ ఫారమ్‌నుంచి ఇంటర్‌మీడియట్ దాకా క్లాస్‌మేట్స్. ఇంటర్‌మీడియట్‌కి వచ్చాక ఈ 'ఒరేయ్' అనుకునే స్నేహితులంతా మారిపోయారు. కొత్తవాళ్ళు వచ్చారు. కొత్త వాళ్ళని ఏమండీ అని పలకరించాలి. రాజేశ్వరరావుకి చిరాకేసి "ఒరేయ్ ఒరేయ్" క్లబ్బు ఒకటి పెట్టాడు. అందులో మెంబర్స్‌గా ఎవరైనా జాయినవ్వచ్చు. అందులో 'ఏమండి' అని ఎవరినైనా పిలిచాడు అంటే అలా పిలవబడిన వాడు వెంటనే ఫట్‌మని జెల్లకొట్టవచ్చు. ఆ క్లబ్బులో చేరి జెల్లలు తిన్నప్పటికీ చాలామంది స్నేహితులని 'ఒరేయ్, ఒరేయ్'గా మార్చుకున్నాము. అందులో సోమయాజులు శ్రీనివాసరావు, తరువాత గరిమెళ్ళ సన్యాసిరాజు, పూళ్ళ శ్రీ సత్యనారాయణ ఇంకా చాలా మంది పేర్లున్నాయి. జ్ఞాపకంలేవు. చాలామంది 'ఒరేయ్, ఒరేయ్' స్నేహితులు అయిపోయారు. ఆరాధ్యుల అన్నాజీ కూడా మా క్లబ్బులో మెంబరే. కానీ అన్నాజీ రావంటే నాకు భయం జాస్తి. అందుచేత అతన్ని ఒరేయ్ అనకుండా 'ఏయ్' అన్నాజీ అనిపిలిచి జెల్లలు తప్పించుకున్నాను. అన్నాజీరావు చిన్నప్పట్నుంచి రాజేశ్వరరావుకి కూడా ఇష్టమైనవాడు.

అతను చాలా కేర్‌లెస్, రెక్‌లెస్‌కూడా. దేవేంద్రుడ్ని లక్ష్యపెట్టేవాడు కాదు. ఇంటర్ మీడియట్‌కి వచ్చాక "ఒరేయ్ ఒరేయ్ క్లబ్బు" కాక "యువజన సంఘం" పెట్టి బుద్ధిరాజా శ్రీశైలం మల్లికార్జునరావుని దానికి ప్రెసిడెంట్‌ని చేశాడు అబ్బూరి కాంగ్రెస్ ప్రభుత్వం వచ్చినప్పటికి కూడా అంతకు ముందు బ్రిటిష్ వాళ్ళమీద తిరగబడ్డ కొంతమంది జనాన్ని [ఇంకా జైల్లో ఉన్నవాళ్ళని] విడుదల చేయకుండా ఆలస్యం చేశారు. వెంటనే విడుదల చేయాలని పెద్ద ఏజిటేషన్, కొంచెం అల్లరి చేశాడు రాజేశ్వరరావు. 1937 లో మేము ఇంటర్ మీడియట్‌కి వచ్చాము. అప్పుడు వెంటనే స్టూడెంట్స్ యూనియన్‌కి కార్యవర్గసభ్యుడిగా ఎలక్ట్ అయిపోయాడు. నన్ను కూడా ఎలక్ట్ చేయించాడు. ఆ ఫొటో కూడా నాదగ్గర ఉంది.*

రాజేశ్వరరావు డ్రామాల్లో కూడా వేసేవాడు. అలాగె మా భమిడి పాటి కామేశ్వర రావుగారు తర్జుమా చేసిన డ్రామాల్లో ఏదో డ్రామా వేయించి అందులో ఒక పోర్షన్ నాకిచ్చి నన్ను ఫస్ట్ టైమ్

---

[కానీ, ఎంత ప్రయత్నించినా ఆ ఫొటో లభ్యం కాలేదు.]

స్టేజి ఎక్కించినవాడు కూడా రాజేశ్వరరావే. తరవాత నన్నుకూడా ఇంటర్‌మీడియట్‌లో కార్యవర్గ సభ్యుడిగా చేర్చాడు.

1938లో జపాన్, చైనామీద "ప్రకటించకుండా" యుద్ధం మొదలు పెట్టింది. అప్పట్లో మార్కెట్ అంతా చాలా చవకరకం జపాను సరుకులతో నిండిపోయి ఉండేది. 'బేడా పరక చాలా చౌక' అని ఏవస్తువైనా సరే, ఖరీదుగా అమ్మేవి కూడా బేడా, అర్థణా. అటువంటి జపాను సరకు కాంగ్రెస్ వాళ్ళు అయ్యుండి వాళ్ళే అమ్ముతున్నారు అని అటువంటి షాపులన్నీ పికెటింగ్ చేయించి "డౌన్ విత్‌ది సర్వీస్ ఆఫ్ జపాన్ గూడ్స్" అని చాలా పెద్ద అల్లరి లేవదీశాడు రాజేశ్వరరావు. ఆ అల్లరిలో మేమందరం పాల్గొనేవాళ్ళం.

ఇంటర్ మీడియట్ సీనియర్ అయిపోయాక, మేము "ఆనర్స్" చదువుతున్నాము. రాజేశ్వరరావు పాలిటిక్స్ ఆనర్స్. రెండవ ప్రపంచయుద్ధం ప్రకటించారు. ఆ యుద్ధంలో మద్దతు ఇవ్వాలా వద్దా అని తర్జన భర్జన చేసి కాంగ్రెస్ వాళ్ళు ఇవ్వకూడదు అని నిర్ణయించారు. చిన్నప్పట్నుంచి "యం.యన్. రాయ్" శిష్యుడు అబ్బూరి వరద రాజేశ్వరరావు. మేము ఇంటర్‌మీడియట్ జూనియర్ చదువుతున్నప్పుడు యమ్.యన్.రాయ్‌ని ఎ.వి.ఎన్. కాలేజికి తీసుకువస్తామని ప్రకటించాము మాయూనియన్ తరఫున. "అయితే తీసుకురావడానికి వీల్లేదు. బాంబులు ఎలా తయారుచేయాలో నేర్చుకోవాలని ఉందా" అని ప్రిన్స్‌పాల్ రానిచ్చారు కాదు. దాంతో అబ్బూరి రాజేశ్వరరావు ఇంటర్ మీడియట్ జూనియర్ స్టూడెంట్స్‌నే కాకుండా సీనియర్ స్టూడెంట్స్‌ని కూడా కలుపు కొని రెండు రోజులో, మూడు రోజులో స్ట్రైక్ చేయించాడు అపుడు ప్రిన్సిపాల్ దిగివచ్చి యమ్.యన్. రాయ్‌ని తీసుకు వచ్చి అడ్రసు చేయించారు. అంటే మేము కూడా యం.యన్.రాయ్ ఫాలోయర్స్‌మే-రాజేశ్వరరావు వెనక. అప్పట్లో "ఇండిపెండెంట్ ఇండియా" అని ఒక మేగజైన్ రన్ చేసేవాడు ఆయన. మాకు కొన్ని మేగజైన్‌లు ఇస్తే మేము కూడా అమ్మే వాళ్ళం.

రెండవ ప్రపంచ యుద్ధం 1939లో వచ్చినప్పుడు యమ్.యన్.రాయ్ "ఇది సామ్రాజ్యవాద దేశాల మధ్య వచ్చిన యుద్ధం కాదు; సామ్రాజ్య వాద దేశాల యుద్ధం కన్నా ప్రజాప్రభుత్వం మీద నమ్మకం ఉన్నవాళ్ళకీ ఫాసిస్టుల మధ్య యుద్ధం కాబట్టి మనం ప్రజాస్వామ్య దేశాలను సపోర్ట్ చేయాలి" అని వాదించి, ఆ యుద్ధంలో హిట్లర్‌కి ఎగినెస్ట్‌గా సపోర్ట్ చేశాడు. కానీ కమ్యూనిస్టులు అప్పట్లో ఆ యుద్ధానికి వ్యతిరేకంగా లేకుండా, అనుకూలంగానూ లేకుండా తటస్థంగా ఉండిపోయారు. కాంగ్రెస్‌వాళ్ళు తర్జన భర్జన చేసి చివరికి వ్యతిరేకమై పోయారు. కానీ యం.యన్. రాయ్ స్టెడీగా మొదటి నుంచి ఒకటే స్టాండ్ తీసుకొని అతను తన నిర్ణయానుసారంగా పనిచేశాడు. రాజేశ్వరరావు "ఈ యుద్ధం ఫాసిస్ట్ దేశాల మధ్య, ప్రజాస్వామ్య దేశాల మధ్య యుద్ధం కాబట్టి మనం సపోర్టు చేయాలి" అని చెప్పి చాలా ప్రచారం చేశాడు. ప్రచారం చేసినా ఫలితం లేక పోయిందనుకోండి. చాలామంది స్టూడెంట్స్ కాంగ్రెస్ తరఫున ఉన్నారు.

"ఆనర్స్" అయిపోయిన తరవాత "నటాలి" అనే సంస్థ......ద్వారా డ్రామాలు వేయించాడు- యుద్ధానికి అనుకూలంగా. ...... విశాఖపట్నం మీద బాంబులు పడ్డాయి. బాంబులు పడ్డంతో ఆంధ్ర విశ్వవిద్యాలయాన్ని గుంటూరు తరలించారు. అపుడురాజేశ్వరరావు కూడా వాళ్ళ

నాన్నగారితో గుంటూరు వెళ్ళిపోయాడు. 1942 తరవాత అతనికి, నాకు కాంటాక్ట్ పోయింది. నేను 1942వ సంవత్సరంలో రాజేశ్వరరావు ప్రచారం బట్టి మిలిటరీ అకౌంట్స్‌లో చేరిపోయాను. మొట్టమొదట పూనా, తరువాత హైదరాబాద్, తరవాత బెంగుళూరు, తరవాత హరిహర అని బెంగుళూరికి రెండు వందల మైళ్ళు, తరవాత విశాఖపట్నం ఇలా సుమారు నాలుగు సంవత్సరాలు మిలిటరీ అకౌంట్స్‌లో పనిచేశాను. అప్పట్లో ఎవ్వరితోని సంబంధం లేకుండా ఉండేవాడిని. తిరిగి వచ్చిన తరవాత కూడా రాజేశ్వరరావు కనిపించలేదు. కొన్నాళ్ళు ఆనందపురంలో పనిచేసొట్ట. నేను 1946లో అనుకుంటాను 'లా' కాలేజీలో జాయినయ్యాను మద్రాసులో [చెన్నపట్నం]. అపుడు కూడా రాజేశ్వరరావు అక్కడ లేడు. ఎక్కడికి వెళ్లిపోయాడో తెలియదు. తరువాత 1961, 1962దాకా అతను ఎక్కడా నాకు కనిపించలేదు.

1962లో నేను ఢిల్లీ వెళ్ళాను. ఢిల్లీ వెళ్ళే సరికి మామిడిపూడి పట్టాభిరామ్ అక్కడ స్పెషల్ కరస్పాండెంట్. రాజేశ్వరరావు 'ఎలైడ్ పబ్లిషర్సు'కి ఎడిటర్‌గా ఉన్నాడు. అతనికొక ఎ.సి. రూము, కారు, అన్నీ సప్లై చేసేవారు. నన్ను వాళ్ళింటికి పిలిచాడు. భోజనం చేశాం. మందుకొట్టాం. ఆ మూడు, నాలుగు రోజులు నేను ఢిల్లీలో ఉన్నాను. రోజూ అబ్బూరి దగ్గర కెళ్ళేవాడిని. మళ్ళీ ఏరా రాజేశ్వర రావు అంటే ఏరా శాస్త్రి అని చెప్పి రెన్యూ అయ్యాము.

తరవాత నన్ను 1975లో ఎమర్జెన్సీలో 'మీసా' కింద అరెస్ట్ చేశారు. విడిపించడానికి రాజేశ్వరరావు చాలా ప్రయత్నించాడు. అతను పి.వి. నరసింహారావుకి, విజయభాస్కరరెడ్డికి, చాలా మంది మినిష్టర్లకి చాలా సన్నిహితంగా ఉండేవాడు. అంతకు ముందు ఒకసారి 1957, 58లో నన్ను రాజేశ్వరరావే అకాడమీ సభ్యునిగా చేశాడు. నన్ను, అజంతాని చేర్చినవాడు రాజేశ్వరరావే.

1939లో ఆంధ్ర విశ్వవిద్యాలయ లైబ్రరీలో చెహోవ్ కథలు చదవడం తటస్థించింది. అందులో 'మిజరీ' అనే కథ నాకు చాలా నచ్చడం వల్ల నేను తెలుగులోకి తర్జుమాచేశాను. అనుసరణ మాత్రమే. పూర్తిగా తర్జుమా కాదు. అప్పట్లో రాజేశ్వరరావే అది గమనించి "ఏంటన్ చెహోవ్ మంచి రచయితరా, అతని కథలన్నీ చదువు"అని ప్రోత్సహించాడు. డాస్టావిస్కీ ('ఇడియట్')కి, టాల్‌స్టాయ్ ('అన్నాకెరెనీనా') కి పరిచయం చేసినవాడు అబ్బూరి రాజేశ్వరరావే. ఆ నవలలన్నీ చదివాను నేను. అంతకు ముందు వోడ్ హౌస్, డికెన్స్ నవల్స్ చదివేవాడిని. ఆ తర్వాత సీరియస్ నవల్స్ ఇంట్రొడ్యూస్ చేసినవాడు రాజేశ్వరరావే.

తరవాత అబ్బూరి హైదరాబాద్ వచ్చాక కాంటాక్ట్ రెన్యూ అయింది. ఉద్యోగం మానేసి హైదరాబాద్ వచ్చేశాడు. వచ్చేశాక –అప్పట్లో అక్కడ ఎ.ఆర్.కృష్ణ అనే ఒకాయన ఉండేవాడు. ఈ మధ్యనే చనిపోయాడు. అతను రాజేశ్వరరావుకు బాగా ఫ్రెండ్. అతనింట్లో రాజేశ్వరరావుని మీట్ అయ్యేవాణ్ణి. ఏమిరా ఇలాగ వచ్చావు అంటే ఏదోలే ఇలాగ వచ్చాను అని అనేవాణ్ణి. మా అన్నయ్య ఇంట్లో సామాన్లు బట్టలు పడేసి రాజేశ్వరరావు ఇంటికి వెళ్ళిపోయేవాడిని. నన్ను ఒక పుత్రుడి లాగ ట్రీట్ చేసేవారు–ఛాయాదేవిగారు, అబ్బూరి వరద రాజేశ్వరరావు. ఒక కొడుకులాగ చూసుకునేవారు. వాళ్లింట్లోనే భోజనం, వాళ్ళింట్లోనే నిద్ర. మళ్ళీ పొద్దున్నే మా అన్నయ్య ఇంటికి వెళ్లి, స్నానం గట్రా చేసి బట్టలు మార్చుకుని రాజేశ్వరరావు ఇంటికే వచ్చేయడం.

రాజేశ్వరరావుకి వచన కవిత్వం అంటే ఇష్టం లేదు. మిల్లు ఖద్దరులాగ వచన కవిత్వం ఏమిట్రా

అనేవాడు. వచన కవిత్వం అంటే అతనికి టెర్రిఫిక్ డిజ్‌లైక్. నాకు కూడా వచన కవిత్వంలో రాస్తున్నవాళ్ళు ఏమిటి రాస్తున్నారో ఇప్పటికీ నాకు బోధపడ్డంలేదు. వచన కవిత్వం రాస్తున్నవాళ్ళు ఏమిటి చేస్తున్నారు, ఏమిటి చెప్తున్నారు అన్నది నాకు అర్థం కూడా కాదు. అందుకే నేను కూడా అబ్బూరితో ఎగ్రీ అయ్యేవాడిని.

రాజేశ్వరరావుకి శ్రీ శ్రీ కవిత్వం అంటే చాలా ఇష్టం. అతని వచన కవిత్వం మాత్రం ఇష్టపడేవాడు. మరి ఎవరిదీ ఒప్పుకునేవాడు కాదు. శ్రీ శ్రీతో రాజేశ్వరరావు స్నేహం తొమ్మిదవ ఏటనుంచి, నా కన్నా రాజేశ్వరరావు ఒక ఏడాదిచిన్న. అది చిన్నప్పుడు తెలీదు. పెద్దయాక తెలిసింది. శ్రీ శ్రీ అబ్బూరి రామకృష్ణారావు గారింటికి వెళుతుండేవాడు. అబ్బూరి రామకృష్ణారావుగారికి శ్రీ శ్రీ అలాగ సన్నిహితులవడంతో-రాజేశ్వరరావుకి తొమ్మిదేళ్ళు అతనికి ఇరవై ఒక ఏడు అయినప్పటికీ ఇద్దరికీ స్నేహం మాత్రం కలిసిపోయింది. అసలు మొదట్నుంచి కూడా మామూలు వాళ్ళతో తిరిగేవాడుకాదు. ఎక్కువగా కవులతోటి, పండితులతోటి తిరిగేవాడు అబ్బూరి రాజేశ్వరరావు. మహాకవి శ్రీ శ్రీని బాబాయ్ అనిపిలిచేవాడు ఇంట్లో.

నాకు మహాకవి శ్రీ శ్రీని శ్రీ శ్రీగా తెలీదు. మా హెడ్మాష్టరు కొడుకు కింద తెలుసును. తరవాత భాగవతుల నారాయణరావుకి శ్రీ శ్రీ బావ అవుతాడు. మా బావ శ్రీనివాసరావు అని ఆయన చెబుతుండేవాడు. "ఒరేయ్, నీ కథలు మా బావ శ్రీనివాసరావు ఉన్నాడు, వాడితో చెప్పి పబ్లిష్ చేయిస్తానురా" అనేవాడు. బాబాయ్ అని రాజేశ్వరరావు అనేవాడు. కాని అతనే శ్రీ శ్రీ అని నాకు తెలియదు. ఇంటర్ మీడియట్‌కి వచ్చాక మా హిస్టరీ అసోసియేషన్ వాళ్లం 1938లో ఒక స్పెషల్ ఎడిషన్ సావనీర్ లాగ ప్రచురించాము. మా ఎ.వి.యన్. కాలేజీ అరవై ఏళ్ళ పండుగ అయింది. అరవై ఏళ్ళ పండుగకి ఒక పుస్తకం వేశాం. అందులో శ్రీ శ్రీ "నా ముద్దుల వేదాంతి" (మాయంటావా? మిధ్యంటావా?) అన్న గేయం మొట్టమొదట శ్రీ శ్రీ మాపుస్తకంకోసం రాశాడు. అది అబ్బూరి రాయించాడు.

అప్పుడు శ్రీ శ్రీ అనే మహాకవి ఉన్నాడని, అతను మరో ప్రపంచం గేయం రాశాడని తెలిసి చాలా సంబరపడిపోయాను. ఆ 'మరోప్రపంచం' గేయం ప్రొసెషన్స్‌లో వెళ్ళేటప్పుడు మేం పాడేవాళ్ళం. భాగవతుల నారాయణరావు చరణాలు అందించడం, మేమందరం పాడడమునూ. బాబూలాల్ అని విశాఖపట్నం కోటవీధిలో ఒక మహమ్మదీయుడు ఉండేవాడు. ఆయన కాంగ్రెస్‌వాది. చాలా స్లిమ్‌గా, అందంగా, సన్నంగా పొడవుగా ఉండేవాడు. బాగా పాడేవాడు. 1937 ఎలక్షన్సులో మేం 'ప్రభాత భేరీ' చేసే వాళ్ళం. అదీ అప్పుడు అబ్బూరి నాయకత్వమే. బాబూలాల్ వెనక పోవడం, బాబూలాల్ చేత పాటలు పాడిస్తూ ఉండేవాళ్ళం. ఆవేళ 'ప్రభాత భేరి' ఉందిరా అనేసరికి రాత్రందరం లైట్ హౌస్ బీచ్ దగ్గర పడుకునేవాళ్ళం. ఇసకే తలగడ కింద పెట్టుకొని దాని మీద తువ్వాలు వేసుకొని పడుకొని పొద్దున్నే ఏ కిళ్ళీకొట్టు....కాఫీ హోటల్ దగ్గరో పళ్ళుతోమేసుకొని అందరం బయలుదేరేవాళ్ళం. ఆ బాబూలాల్ మంచిపాటగాడు. చాలా మంచి పాటలు పాడేవాడు.

అది ఏమిటి అంటే-

"నా జన్మహక్కేదిరా-బాపూజీ

నా జన్మహక్కేదిరా బాపూజీ

.................................

*కలలోని శిలలాయెరా—బాపూజీ*
*నారాణి వాణేదిరా.............'*

అని చాలా చక్కగా బసవరాజు అప్పారావుగారి గేయమో ఏదో అది, అది పాడేవాడు; అది గాకుండా చాలాగేయాలు పాడేవాడు. అతని వెనకాల అన్ని పాటలూ పాడేవాళ్లం మేము. అప్పుడు కూడా లీడరు అబ్బూరే. తనే మమ్మల్ని తీసుకువెళ్ళేవాడు.

అబ్బూరికి కమ్యూనిజం అంటే పడదు. కానీ నక్సలైటైనా-ఇప్పుడు ఐ.వి.మీద ఎనిమిది లక్షలు పెట్టారా. అతను అబ్బూరి వరద రాజేశ్వరరావుకి స్నేహితుడనుకోండి. అతనింట్లో దాక్కున్నాడనుకోండి. ఎనిమిది లక్షలకీ లక్ష్యపెట్టడు. ఇతను ఒక కమ్యూనిస్టు అని వ్యతిరేకించడు. అతన్ని తన ప్రాణాలతో సహా రక్షిస్తాడు. ఎంతటి వ్యతిరేకుడైనా కూడా స్నేహితుడైతే అతన్ని రక్షించడం, అతన్నికాపాడడం, అత్యంత స్నేహంగా ఉండడం అబ్బూరి లక్షణం.

రాజేశ్వరరావు లక్షణాలలో బాగా మనం మెచ్చుకోదగ్గది ఏమిటంటే, ఎంతటి ఘోరమైన అపోనెంట్ అయినా తనకి స్నేహితుడిలా ఉంటే మాత్రం ఆయన రక్షిస్తాడు. నేను కమ్యూనిస్టు సింపతైజర్ని అని తెలుసు. కానీ నన్ను ఆ విషయం గురించి ఎప్పుడూ ప్రస్తావించలేదు. మిగతా విషయాలు మాట్లాడేవాడు. ఆయనతో అప్పుడప్పుడు ఏదైనా అన్నా కూడా ఏదైనా థీరిటికల్ గా అనేవాడు తప్ప అది మరోలా అనేవాడు కాదు.

సరే, వియత్నాం యుద్ధం గురించి ఒకసారి చెప్పాడు. "వియత్నాం యుద్ధం అన్నది ప్రజాస్వాతంత్ర్య యుద్ధం రా. అది ప్రజల విమోచనకు యుద్ధం. దాన్ని కమ్యూనిస్టులు అన్న వాళ్లు నడిపించారు. కాబట్టి నడిచింది. అది ప్రజావిమోచన యుద్ధమే కానీ కమ్యూనిస్టుల యుద్ధం కాదనేవాడు. చివరికి అతని మాటే నిజమయింది-అబ్బూరి వరద రాజేశ్వరరావు మాట.

అబ్బూరి వరద రాజేశ్వరరావు ఆ విధంగా నాకు రాజకీయంగా, నాటకీయంగా, సాహిత్యపరంగా అన్ని విధాలా కూడా నాయకుడే అని చెప్పవచ్చు. సరదాగా మాట్లాడడంలో మరిక అతనికి మించిన వాడుమరొకడు లేదు. నాతో మాట్లాడడమే ఎడ్యుకేషన్ అన్నాడే గిరీశం, అట్లా ఆయనతో మాట్లాడడం అన్నదే ఒక ఎడ్యుకేషన్.

చెణుకులు కొన్ని చెప్తాను.

**అబ్బూరి రాజేశ్వరరావు చెణుకులు:** ఎ. ఆర్.కృష్ణ సాయంకాలం అయ్యేసరికి ఒక పది పదిహేనుమంది స్నేమితుల్ని కూడబెట్టుకునేవాడు. కృష్ణ సెంటర్లో కుర్చీవేసి కూర్చునేవాడు. ఇటొక సోఫా, అటొక మంచంపైన అందరం కూర్చునేవాళ్ళం. రెండు మూడు కుర్చీలు, సాయంకాలం దగ్గర్నుంచి మందు మొదలుపెట్టేవాడు. అదే కార్యక్రమం. దానికి రాజేశ్వరరావు ఏమని పేరు పెట్టాడంటే-'శ్రీకృష్ణరాయబార్" అని పేరు పెట్టాడు. అతనికి నాటకాలంటే చాలా ఇష్టం కాబట్టి.

రెండోది ఏమిటి అంటే, తెలుగు దేశం వచ్చాక ఒకాయన తెలుగుదేశం పార్టీకి లీడరుగా ఎన్నికయ్యాడు. చాలామంది సపోర్టు ఉన్నప్పటికీ కూడా, ఈయనికి ఒక కులం మీద అభిమానం ఎక్కువని ఒక నింద ఉండేది. అటువంటి వాళ్లందరికీ అతనంటే ఇష్టం ఉండేది కాదు. సరే కాంగ్రెస్

వాళ్ళు ఎలాగూ ఎగెనెస్టు. అబ్బూరి కాంగ్రెస్ పార్టీకదా –'ఒరేయ్ నువ్వు ఫలానా లీడరు మీటింగ్ కెళ్ళావా ఎప్పుడైనా? అని అడిగాడు. 'నేను ఎప్పుడూ వెళ్ళలేదురా, ఏమీ?"అని అడిగాను. 'సోదర సోదరీమణులారా అని చెప్పడం మానేశాడురా' అన్నాడు. 'మరైతే ఏమిటంటున్నాడు–తెలుగు ఆడపడుచులారా, అన్నదమ్ములారా అని పిలుస్తున్నాడా' అని అమాయకంగా అడిగాను. 'లేదురా, చౌదరి చౌదరీ మణులారా' అని పిలుస్తున్నాడురా అన్నాడు.

ఈ జోక్ నేను చాలామందితో చెప్పేసరికి కొందరు సొంతం చేసుకున్నారు.

జోక్‌కి సమయం వచ్చిందంటే ఎవరినీ స్పేర్ చేసేవాడు కాదు. వాళ్ళ నాన్నగారు చనిపోయిన తర్వాత [అబ్బూరి రామకృష్ణారావు గారిని ఒక్క మాట అనడు. వాళ్ళ నాన్నగారికి చాలా సేవలు చేశాడు.] తల్లిని సంరక్షించే బాధ్యత అబ్బూరిమీదే పడ్డది. ఆ తల్లి "ప్చ్.....ఏమిటో భగవంతుడు నన్ను తీసుకుపోయాడు గాదు. ఆయన్ని తీసుకెళ్ళిపోయాడు. నన్నొదిలి పెట్టేశాడు. నన్ను కూడా పిలిచుకుపోతే బాగుణ్ణు' అని రోజూ అనేది. అని ఏమైనా చిన్న గుండె నొప్పి వచ్చేసరికి 'ఒరేయ్ వరదా–గుండె నొప్పి వచ్చిందిరా, వైద్యుణ్ణి పిలవరా' అనేది. అంటే, 'ఏంటమ్మా, భగవంతుడు పిలుస్తూ ఉంటే వైద్యుణ్ణి పిలవమంటావేమిటి! అని, వెంటనే ఏ కారో, ఏ ఆటోనో వేసుకొని డాక్టర్ని తీసుకువచ్చేవాడు. అంటే జోక్ విషయంలో ఎవరినీ స్పేరు చేసేవాడు కాదు.

నా కిద్దరు భార్యలు. అందులో రెండోది బాగా పాడేది. ఈ మధ్యనే చనిపోయింది. 'ఒరేయ్ శాస్త్రి, నీ ద్వితీయం అద్వితీయంగా పాడుతుందిరా. అందుచేత మనం ఒక టేప్ చేయిద్దాం' అని వీడియో చేయించాడు. అదే ఆఖరికి నాకు ఇప్పుడు మిగిలింది.

చెట్టు కవి అని ఒక కవి ఉన్నాడు. 'ఆ చెట్టుకవి చెట్టు మీద కవిత్వం ఎక్కువగా రాస్తున్నాడురా. పొయెట్రీలో పొయెట్రీ అంటే 'ట్రీ' గా ఎంచుకున్నాడన్న మాట'–అని జోక్ వేశాడు.

అంతే టపీమని అట్లా అబ్బూరి నోటి నుండి జోకులు అలా వచ్చేస్తాయి. తర్వాత, ఇంకా చాలా జోక్స్ ఉన్నాయి. నేను మర్చిపోయాను. ఇప్పటికి చాలు!

అబ్బూరి తలుచుకున్నాడూ అంటే దీపకరాగం పాడకుండానే దీపాలు వెలిగించగలడు; మేఘమల్లరి పాడకుండా వర్షాలు కురిపించగలడు. అంతశక్తి సామర్థ్యాలున్నవాడు అబ్బూరి. వాళ్లది తెనాలి. తెనాలి రామకృష్ణుడు కంటె అబ్బూరి గొప్పవాడని నమ్ముతాను నేను.

–(సాహితీగవాక్షం, 'ఆంధ్రప్రభ', సోమవారం, ఆగస్టు 16, 1993)

# వరద–కొన్ని స్మృతులు

వేణు

వరద. ఎప్పుడూ ఎక్కడికో వెళ్లబోతున్నట్టే, వెళ్లి పోతున్నట్టే వుండేవాడు. ఇంట్లో నుంచి రోడ్డు మీదికి వస్తే నలుగురం ఒక పక్క పోదామని మళ్లితే, తను ఇంకొకపక్క పోవలసినట్టు పోయేవాడు–పైకి పోయి అందరం ఒక చోట కలవడం తప్పకపోయినా. అట్లానే, యాభై సంవత్సరాలు గడిచి పోయాయి. దూరంగా వున్నా దగ్గర వున్నట్టే, దగ్గరగా వున్నా దూరంగా వున్నట్టు. ఇప్పుడు తనేమో ఇంకోవైపు నిజంగావెళ్లిపోయాడు, అనవసరంగా. నామాదిరి ఇంకా చాలా మంది వుండిపోయాము, ఇంకో మలుపు తిరిగితే వరద కలవడన్నమాట పూర్తిగా నమ్మలేక.

●

వాళ్లది నెల్లూరులే, అని సర్ది చెప్తూ వుండేవాడు వరద మొదట్లో, ముఖ్యంగా విశాఖపట్నం వైపు వాళ్లతో– శ్రీ శ్రీ పూరికేవున్నా, నామాట వాళ్లకు అర్థం కాదేమోనని, అర్థం అయినా నన్ను ఎగతాళి చేస్తారేమోనని. చేస్తే కూడ తనకేం ఫరవాలేదని అనిపించేట్టు అనేవాడు. ఆ మాటకూడ, తనకు ఫరవాలేనప్పుడు, నాకు వుండనవసరం లేదన్నట్టు.

హైదరాబాదులో మాది చిన్న ఇల్లు ఒకటి నచ్చుగా, నచ్చుగా యిటీవలి ఏర్పడుతుంటే, సొంతకొంపలో ప్రాణం హాయిగా వుంటుందిలే అని ప్రోత్సాహంగా అంటుండే వాడు వరద.

రోజంతా ఆ యింటి దగ్గర పనివాళ్లతో గడిపి, సాయంత్రం ఆలస్యంగా ఇంటికి, అంటే వరద వాళ్ల యింటికి, పోతే, ఎదురు చూస్తూ వుండేవాడు. ఇంత ఆలస్యం అయిందేం, అని ఆదుర్దాగా అడిగేవాడు. మన వయస్సులో (నేను వరదకన్నా ఐదారు నెలలు ముందు పుట్టాననుకొంటూ, ఈ లోపల పెద్ద ఘనకార్యం ఏమి చెయ్యకపోయినా) యిట్లాంటి పనులు మనమే చేసుకుంటూ వుండకూడదు. ఒళ్లు ఏమైనా అయితే తట్టుకోవడం కష్టం, అనేవాడు. స్నానం చేసి వరదవి వుతికిన చొక్కా, పంచె కట్టుకొని, కొంచెం మందు పుచ్చుకొని, మాట్లాడి మాట్లాడి, భోంచేసి పండుకుంటే హాయిగా నిద్ర పట్టేది.

•

తనకు అంత బాగా నిద్రపట్టలేదనే వాడు మర్నాడు పొద్దున్న. నాకు చివుక్కుమనేది.

అవతల మాయింటి తలుపులూ, కిటికీలు ఎక్కించిన తర్వాత తనూ, ఛాయ చూడ్డానికి వస్తే, ఛాయ టెంకాయ కొడ్తే, అయిపోయిందిలే గృహప్రవేశం అన్నాడు.

తనక్కూడ అక్కడ (మా ఇళ్లదగ్గర) చోటు యిస్తామన్నారు కాని యివ్వలేదని నొచ్చుకునేవాడు. ఇప్పుడన్నా యిస్తే, తాము కూడ అక్కడ ఇల్లు కట్టుకుంటాం అనేవాడు. ఇప్పుడు యింకెక్కడికి మారుతారులే అని కూడ వున్న వాళ్లు అంటే విసుక్కొనేవాడు. తర్వాత సమాధానంగా అనేవాడు- ఇప్పుడు వేణు కూడ వుంటాడు కదా అని, ఇంకా చాలా మంది దగ్గర స్నేహితులు, సాహితీగోష్ఠి సన్నిహితులు, సమకాలీకులు ఎన్నాళ్లగానో అక్కడికి చేరినా.

ఆఖరి సంవత్సరాలు అక్కడే గడుపుదామని హైదరాబాదుకు తిరిగి పోతే (వస్తే), జీవితపు మహారంగాలలో ఓడి పోయివచ్చారని ఎవ్వరేమన్నా అనుకుంటారేమోనని భయపడకు, అని మరీ మరీ చెప్పేవాడు వరద. అందరూ ఎక్కడో అక్కడ దెబ్బ తిన్న వాళ్లే. పైకి మహ గొప్పగా తిరుగుతుంటారు పదిమందిలో, నాకంటె లేరంటూ, అని నాకు ధైర్యం చెప్పేవాడు. మన తెగవాళ్లు వున్నారే (అంటే పత్రికలలో ఏదో ఒక పని చేసే వాళ్లు) మరీలే ఈ వూళ్లల్లో ఇవన్నీ అంత పట్టించుకో కూడదనే వాడు. ఇంకొకరి ప్రమేయం లేకుండా, మన బ్రతుకు మనం బ్రతకవచ్చు- అని నా సందేహాలన్నీ తీర్చేవాడు. మన పని మనం చేసుకోవచ్చు అంటూ తను చేస్తున్న పనులు, వ్రాస్తున్న వ్రాతలను గురించి చెప్పేవాడు.

నాట్యగోష్ఠి తను తిరిగి నెలకొల్పి దాన్ని గురించి చెప్పేవాడు. అందులో నా పేరు కూడ పెట్టానని చెప్పి, ఆకాయితాలు చూపించాడు. తను తిరిగి పత్రికలలో వ్రాయడాన్ని గురించి మాట్లాడుకొనే వాళ్లం. గడచిన రోజులన్నీ జ్ఞాపకానికి వస్తే, తెల్లవారు తున్నప్పుడు తేట ఏటినీళ్లల్లో ఇసుక మట్టి కణం కణంగా మెరిసినట్టు, ఆ రోజుల అనుభవాలు ఎన్నో అర్థాలతో తెలిసి వస్తే, అవి అందరికి తెలిసేట్లు వ్రాస్తే బాగుంటుందని తోచి, తిరిగి వ్రాయడం మొదలు పెట్టాడు. అట్లా ఎందుకు వ్రాయాలనిపించిందో చర్చిస్తూ, "స్మరణలోన మరణ ఘోష" అన్న introductory వ్యాసం వ్రాశాడు. "గతానికి, మన గమ్యస్థానానికి అనివార్య సంబంధం అనూహ్యంగా వుందని నేను నమ్మేవాణ్ణి. గతాన్ని తలుచుకున్నప్పుడల్లా వ్యక్తికి గమ్యస్థానం చేరువవుతున్నదని యింగిత జ్ఞానం

వున్న ప్రతి వ్యక్తికి అవగతం కాక మానదు" అని. ఇంకా వ్రాశాడు. "మా రోజుల్లో...... పగటి కలలు తెగకనే వాళ్లం. అలా కలలు కాసి కాసి అలసి పోయిం తరవాత వాస్తవిక జగత్తులోకి ప్రవేశించి జీవితం మీద విరక్తి పెంచుకొనే వాళ్లం ...." అంటూ.

●

అల్లాగే "నటాలి" ని గురించి వ్రాశాడు."నాట్యగోష్ఠి" అన్న యింకొక వ్యాసంలో ... . "నటాలి" కలిపించిన అవకాశంతోనే కలిశాం మేమిద్దరం మొట్టమొదట. ఆ రోజులను గురించి వరద వ్రాసిన మాటలు ఇప్పుడు చదివితే తమాషాగా వుంటుంది. అట్లాంటి బృందం మద్రాసులో మొదట ఏర్పడటం వల్ల, "మేం తలపెట్టిన సిబ్బందిని సమకూర్చలేకపోయాం. తెలుగు దేశానికి దూరంగా వుండటం చేత, ముందుగా శ్రీరంగం శ్రీనివాసరావు, మావిళ్లపల్లి వేణు గోపాలరావు, కోటేశ్వరరావు నటాలిలో చేరారు" అని వరద వ్రాశాడు. ఇంకా కారణాలు ఎన్నో వుండేవి. వాటిలో ముఖ్యమైనది, సపోర్టు. అంతవరకు మాష్టారుగారు (వరద తండ్రి రామకృష్ణారావుగారు) ఆధునిక నాటక వుద్యమాన్ని తెలుగు దేశంలో స్థాపించడానికి చేసిన ప్రయత్నాలన్నిటికి, అనుకున్న ప్రోత్సాహం సహాయం దొరకలేదు వారి experimental నాటక ప్రయోగాలన్నిటిని ఎంతోమంది మెచ్చుకున్నా. తర్వాత యుద్ధకాలంలో ఆంగ్లేయుల సహాయంతో "నటాలి" మద్రాసులో ఏర్పడడం ఒక negative factor కూడా అయిందేమో... అదంతా వేరే విషయం.

●

నేను శ్రీ శ్రీతో, యింకొంత మందితో కలిసి నటాలిలో చేరడం గమ్మత్తుగానే జరిగింది. నేను నటుణ్ణిగాను, నాటకకర్తనుగాను, కవిని గాను, ఎట్లాంటి రచయితను గూడ కాదు ఎన్నాళ్లో పత్రికలలో పనిచేసినా. చిన్నప్పుడు మా నాన్నగారి ప్రోత్సాహం, training ల సహాయంతో నేను, మా అన్న, మావిళ్లపల్లి చక్రవర్తి, నెల్లూరు జిల్లా స్కూళ్లలో elocution పోటీలన్నీ గెలిచేవాళ్లం, తను seniors లో, నేను juniors లో-రెండు మూడు సంవత్సరాలు వరసగ్గా. (మా నాన్నగారు, మావిళ్లపల్లి కృష్ణయ్య గారు నాటకాలు వేసేవారు, చిత్రకళలో మంచి రుచి వున్నవారు. మా యిద్దరికి చరిత్రలో, సాహిత్యంలో చిన్నప్పటి నుంచి రుచి కల్పించారు.) మేమిద్దరం స్కూలు పోటీలకు పోయినప్పుడంతా గుసగుసలు ఆరంభమయ్యేవి, "కృష్ణయ్య కొడుకులు వచ్చా"రని. అయితే నాకేమో స్టేజి ఎక్కినప్పుడల్లా ఏడుపు వచ్చేది భయం చేత! మా అన్న మాత్రం మా నాన్నగారు చెప్పినట్లుగా బాగా హాయిగా తన పాత్ర చేసేవాడు. ఇప్పటికి తనకు నాటకాలంటే మహా యిష్టం.

ఇదంతా ఎందుకు చెప్తున్నానంటే, నేను నటాలిలో మద్రాసులో చేరడానికి కారణం నాటకాల పిచ్చి అంతకాదని తెలియచెప్పడానికి. ముఖ్యకారణం నాకు మాష్టారు (వరద తండ్రి) గారితో ఏర్పడ్డ సన్నిహిత సంబంధమే. ఒక భ్రమలాగ గడిచిపోయాయి ఆ రోజులు, నిజం చెప్పాలంటే. ఒక మరవలేనిఅనుభవం నిలచిపోయింది. మబ్బులచాటున కొండలలో, మబ్బుల వెలుగులో ఆకాశవీధులలో ఆ రోజులు గడిపినట్టు. యాభై ఏండ్ల తర్వాత కూడ, యింకా ఆ భ్రమ, ఆ స్పెల్, ఎక్కడో దాగి వున్నట్టు అనిపిస్తుంది-అప్పుడప్పుడు, ఏ పని కూడ ఎట్లాంటి విశిష్టతతో చెయ్యలేకపోయినామే అని తోచినప్పుడల్లా. వరద అయితే, తన సాహితీకృషి చేస్తూనే వుండేవాడు.

మాష్టారు చూపించిన దోవలో, తన పరిస్థితులకు అనుగుణంగా.

ఇన్నాళ్ళా మాష్టారి గారి మాట, ఆయనతో గడిపిన రోజులు జ్ఞాపకం వస్తే వరదతో మాట్లాడ్డానికి అవకాశం వుండేది మేము కలుసుకున్నప్పుడల్లా. ఇప్పుడు వరద కూడ ఒక జ్ఞాపకం అయిపోయినాడు.

మాష్టారు నటాలిని నడిపించిన రోజులను గురించి వరద వ్రాసిన స్మృతులను ఇప్పుడు చదివితే, నవ్వు వస్తుంది. ఒక విధమైన despair మెరిసినట్టు మెరిసి అణిగిపోతుంది. అదంతా కూడ యింకో విషయం.

●

ఇంతకూ నటాలి ఒక సంవత్సరం కంటె ఎక్కువ నడవలేదు. నటాలి ప్రారంభోత్సవం మాత్రం ఘనంగా జరిగింది మద్రాసులో 1944 సంవత్సరం ఏప్రిల్ 2వ తేదీన. అబ్బూరి వారు కొత్త రీతిన వేయించిన కన్యాశుల్కం నాటకాన్ని St. Mary's Hall పట్టకుండా కూచున్న, నుంచున్న ప్రేక్షకులు చూచారు, ఆనందించారు. (తెర ఎత్తనంత వరకు తెరవెనక అంతా భీభత్సంగా వుండినట్టు జ్ఞాపకం. సెట్లు తయారుగాలేవు, నటులు తయారుగాలేరు, తెర ఎత్తగలుగుతామా అని మాష్టారు గారు భయపడ్తుంటే మాకందరికి కంపన పుట్టినట్టయింది. మాష్టారు గారు రామప్పంతులు వేషం వెయ్యవలసింది వెయ్యలే-ఒక్క పనీ అనుకున్నట్లు కాకపోవడం వల్ల: శర్మగారి సెట్లతో పడ్డ బాధలవల్ల: అనుకున్న నటీనటులు చాలామంది రాకపోవడం వల్ల. మధురవాణి వేషం మొదట అనుకున్న ఆవిడ వెయ్యలే. వెంకటేశం రాలే: నళిని రంజన్ కుమార్ (అసలు పేరు వుండవల్లి సూర్యనారాయణ అని ఒక స్నేహితుడు చెప్పేవాడు) వేస్తున్న గిరీశం ఎట్లా వుంటుందో న్న భయం పోలే: శర్మగారు మధురవాణి సెట్‌ను రంగం మీద బిగించెయ్యడం వల్ల నాటకమంతా దాంతోటే జరిపిస్తే వచ్చినవాళ్లు ఏమనుకుంటారో అన్న కొత్త భయం పట్టుకుంది. మరీ ఆలస్యమౌతుంటే మాష్టారుగారు, మేమందరం, శ్రీ శ్రీ ని బతిమిలాడాము: స్టేజి ముందుకు పోయి అందరికి నమస్కారాలు చెప్పి, ఆలశ్యానికి క్షమాపణ కోరుకుంటూ, కన్యాశుల్కం కొత్తరీతిని, మాష్టారుగారి ప్రయోగ ప్రయత్నాలు అందరికీ అర్థమయ్యేటట్లు తన చక్కని మాటలతో చెప్పి, కిటకిటలాడే జనాన్ని మంచి మూడ్‌లో పెట్టి రమ్మని. తెరవెనుక నుంచి ఆ జనాన్ని చూసి, ఏమైతేనేం నేను పోనన్నాడు శ్రీ శ్రీ. నిజంగా రంగం మీదికి తొయ్యవలసి వచ్చినట్టయింది మా అందరి ఆదుర్దాలో. ఎట్లాగో రంగం మీద కాలు పెట్టి, నోట మాటరాక అటూ ఇటూ తిరగడం మొదలుపెట్టాడు. జనంలో మరీ గోల ఎక్కువవుతుంటే లోపలికి లాగేసుకున్నాం శ్రీ శ్రీ ని.

నేను వెంకటేశం వేషం ఎట్లావేశానో తలచుకుంటే ఇప్పటికి ఒళ్లు ఝల్లు మంటుంది: వేసుకున్న గుడ్డలతోనే, పాంటు మాత్రం పైకి మడిచేసి పోయి, జనాన్ని చూసి "మహాప్రభో" అనుకొని, మొహం మళ్లించేసి అనవలసిన మాటలు ఎట్లాగో అనేసి బయటపడ్డానని జ్ఞాపకం.

ఇంత గలాభాలోనూ, నాటకం మాత్రం మహగొప్పగా నడిచి పోయింది. అంతా అయిపోయింతర్వాత, మధురవాణి యింటి సెట్ మధ్య నులక మంచం మీద మాష్టారు గారు కుప్పగా కూలినట్లు కనిపించారు. చుట్టూ చేరి అందరం గోల పెట్టాము-నాటకం బ్రహ్మాండంగా

జరిగిందని అందరూ అనుకుంటున్నారని. నాటకం చూచిన పెద్దలందరూ స్టేజి మీదికి వచ్చారు, మాష్టారుగారి నాటకాన్ని ఎంతో మెచ్చుకున్నారు. అదే ననుకుంటా "నటాలి high point. కొన్ని నెలల్లోనే మాష్టారుగారు కుటుంబ పరివారంతో సహా తెనాలి వెళ్లిపోయారు. అక్కడ కూడ చాల రోజులు జరగలే, సపోర్టు లేక. ఇంకొన్ని నెలల్లో నేను గూడ మద్రాసు వదలి హైదరాబాదు పోయినాను, దారిలో తెనాలిలో ఒక రోజు వుండి.

•

హైదరాబాదులో వరద కలిసేవాడు అప్పుడప్పుడు ఫణి భూషణరావుతో కూడ. మహాసంధిగ్ధకాలం అది. ఇంకో రెండు సంవత్సరాల లోపలే దేశం స్వతంత్రం అవుతుందన్న నమ్మకం మాలో చాలామందికి వుండేది కాదు. ముఖ్యంగా హైదరాబాదులో ఏమవుతుందో న్న సంశయం వుండేది. Police action లాంటిది జరగవలసి వస్తుందనీ, హైదరాబాదు కూడ దేశంలో ఒక భాగం అవుతుందని నమ్మకం కూడ ఒకవైపు ఉండేది. ఆ రోజులలో జరిగిన ఒక చిన్న గమ్మత్తయిన విషయం జ్ఞాపకానికి వస్తుంది. నిజాం ప్రభుత్వం ఆఖరి రోజులలోనే కుందూరి ఈశ్వరదత్తుగారు అక్కడ Information adviser గా చేరారు. నేనప్పుడు నారాయణగూడ YMCA లో వుండేవాణ్ణి. అప్పటి సమస్యలను గురించి ఒక సభ జరిపించాలనుకున్నా YMCA లో. నేను దత్తుగారిని Lakeview Guest House లో కలిసి ఆ సభలో పాల్గొనమని కోరాను, అధ్యక్షుడిగా వారికి అభ్యంతరం లేకపోతే. కాదంటే, వచ్చి మాట్లాడినా మహాసంతోషం అని. ఆయన రావడానికి ఒప్పుకున్నట్టు జ్ఞాపకం. అట్లాగే, నేను అక్కడ అప్పుడు పని చేసే పత్రికలో ఒక ప్రకటన వేయించాము. దానివల్ల పెద్ద గొడవ అయినట్లు మర్నాడు, వరద, ఫణి వచ్చి చెప్పారు. ఆ సభకు దత్తుగారు రావడం లేదని రెండవరోజు పత్రికలో యింకో ప్రకటన వేయించవలసి వచ్చింది. ఆదయింతర్వాత వరద అప్పుడప్పుడు కనిపించేవాడు. అయితే యింకో సంవత్సరంలోపుగానే, అంటే Police Action ముందే, నేను హైదరాబాదు వదలి పోయినాను. అక్కడక్కడా తిరిగి ఇంకో 10, 12 ఏండ్ల తర్వాత ఢిల్లీ చేరితే, వరదను మళ్లీ కలుసుకోడం అయింది. ఈసారి పత్నీసహితం.

ఒక రోజు అనుకోకుండా కనిపించారు వరద, ఛాయ యిద్దరు, ఒక బస్సు క్యూలో. ఛాయను మొదటిసారి అదే చూడ్డం నేను. యింకో ఇరవై ఏళ్లపైగానే గడిచిపోయాయి ఢిల్లీలో మా అందరికి దగ్గరగా, దూరంగా.

ఢిల్లీలోనే మాష్టారు గారిని తిరగి కలవడం జరిగింది. మాయింటికి అప్పుడప్పుడు వచ్చి ఒకటి రెండు రోజులు వుండి పోయేవారు. మళ్లీ పాతకలవరాలు పైకొచ్చినట్లు, కడుపు కలియబెట్టినట్లు అయేది. మద్రాసులో మాష్టారితో గడిపిన రోజులలో కన్నకలలు కలలుగానే వుండి పోయినాయేనని, అందలేని అనుభూతులు అందలేనివిగానే వుండిపోయినా యేనని, కాలం అర్థం లేకుండా గడిచి పోతున్నదేనని, అజ్ఞాత బాధ ఎక్కడో పీకుతునే వుండేది. దాన్నంతా కిందికి నెట్టేసి, రోజు పనులల్లో మునిగిపోయి, అందులోనే మనశ్శాంతి వుందన్న ఇంకో భ్రమతో కాలం గడిపేవాళ్లం.

ఆ రోజుల్లో మాష్టారిలో కూడ ఒక విధమైన నిస్పృహ కనిపించేది, నిస్సహాయత కూడ.

వరద సంగతి చెప్పలేను. తననుకూడ ఏదో అశాంతి కొద్దిగానో గొప్పగానో వెంటాడేదని నా

సందేహం. ఏవో పనులు చేస్తూ కాలం గడిచి పోయినా, సార్థకమైనపని ఏమీ చెయ్యలేక పోయినామే అన్న ఆరాటం వెంటవస్తూనే వుందని అనిపించేది–ఇంకా అనిపిస్తూనే వుంటుంది. వరదకు కూడా అట్లాగే వుండేదోమో.

●

ఢిల్లీలో వరద వాళ్ల ఇంట్లో 1979 ఏప్రిల్ నెలలో మాష్టారుగారు పోయినప్పటి దృశ్యాలు, సంగతులు నిన్న మొన్న చూసి నట్టు యింకా వుంటుంది. జీవంలేని ఆయన దేహం వున్న గదిలో కొన్నిగంటలు నేను గడిపినట్టు జ్ఞాపకం, వాళ్లూ వీళ్లూ వస్తూ పోతూ వుంటే. మంచు గడ్డలను మారుస్తూ, చేరుస్తూ, అనుకొనేవాణ్ణి ఆ దేహానికి ఎక్కడ దెబ్బతగలకుండా వుండడం చాల అవసరమని. అక్కడనుంచొని, మాష్టారుగారితో మద్రాసు సముద్రతీరంలో, మౌంట్ రోడ్ లో గడిపిన గంటల గురించి అనుకుంటూ వుండేవాణ్ణి.

అదంతా అయింతర్వాత, ఒక విధంగా జీవం, జీవనం కుదుట బడినట్టయింది. వరద ఎట్లాంటి క్షోభపడ్డాడో నేను చెప్పలేను. కాని, తనకు కూడ ఇంకెక్కడి సంఘర్షణలే అవి అనిపించిందేమో నన్న సందేహం నాకు వుండేది.

త్వరలోనే వరద, ఛాయలు ఢిల్లీ వదలి హైదరాబాదుపోయారు. నేను కూడ హైదరాబాదు చేరినప్పుడు, ఎప్పుడూ అర్థంకాని విషయాలు, మాష్టారుగారు చూపించిన మబ్బులోని శిఖరాలు మబ్బుల్లోనే ఎందుకు వుండి పోయాయన్న సంగతులు మాట్లాడుకోవచ్చనుకొనేవాణ్ణి. ఇప్పుడు వరద కూడ లేడు.

అయితే ఒక పెద్ద ప్రయత్నం చేసి పోయినాడు వరద. నిండయిన జీవితం నిండుగా గడపడానికి, మానవ సంస్కారం అవిభాజితమైనదన్నమాట అవగాహన చేసుకోడానికి, మాష్టారిలాంటి వారు చేసినపని, చూపించిన దారి ఎట్లా రూపొందిందో అందరికి తెలిసివచ్చేట్లు ఆనాటి అనుభూతులెన్నిటినో గురించి చక్కగా వ్రాశాడు. కొంతైనా తన బాధ్యత నిర్వహించుకున్నాడు.

ధన్యుడు, నాలాంటి వాళ్లకంటె.

['వరదస్మృతి' కోసం ప్రత్యేకంగా రాసిన వ్యాసం]

# 'ప్రతిమాసుందరి' కర్త 'వరద'

## ఎ.ఎల్. నరసింహారావు

అబ్బూరి రామకృష్ణారావుగారి కుటుంబంతో నాకు ఐదు దశాబ్దాలపైగా సన్నిహిత సంబంధం ఉంది. నన్ను గుంటూరు నుంచి కమ్యూనిస్టు పార్టీ విశాఖపట్నంలో పని చేయడానికి పంపింది. ఆ నాటి నుంచి నాకు ఆ కుటుంబంతో సన్నిహిత సంబంధం ఏర్పడింది. ఆ రోజుల్లో రామకృష్ణారావుగారికి ముగ్గురు పిల్లలు. పెద్దబ్బాయి వాణీకుమార్, రెండో అబ్బాయి పేరు వరద రాజేశ్వరరావు, అమ్మాయి పేరు రాజ్యలక్ష్మి. ఆ ముగ్గురూ ఆ రోజుల్లో హైస్కూల్ తరగతుల్లో చదువుతుండేవారు.1936 వరకూనాకు ఈ పిల్లలతో అంతగా పెద్ద సంబంధం ఉండేది కాదు. 1936 లో నేను, రామకృష్ణారావుగారు కమ్యూనిస్టు పార్టీనుంచి విడిపోయిన తర్వాత ఎమ్.ఎన్. రాయ్ గ్రూపుతో సంబంధం ఏర్పడింది. 1936 చివరి భాగంలో రాయ్ దంపతులను మేము విశాఖపట్నం ఆహ్వానించాం. పి.హెచ్. గుప్త గారి ఇంట్లో వారికి బస ఏర్పాటు చేశాం. అప్పట్నించీ నాకు వాణి, వరదరాజేశ్వరరావులతో సంబంధం ఏర్పడింది. అబ్బూరి వరద రాజేశ్వరరావు అంటే చాలా మందికి తెలీదు. 'వరద' అంటే బహుళ సంఖ్యాకులకు తెలుసు. ఇతను హైస్కూల్ విద్యార్థిగా ఉన్నప్పుడే హైస్కూల్ మేగజైన్‌లో చిన్నచిన్న కవితలు వ్రాసేవాడు.

రామకృష్ణారావుగారు మంచి కవిగా పేరు పొందారు. ఆయన వ్రాసింది తక్కువైనా పేరు ప్రఖ్యాతులుమాత్రం నేటికీ నిలచి ఉన్నవి. ఇంగువ కట్టిన గుడ్డ వాసన పోదన్నట్లు తండ్రి కవిత్వధోరణి 'వరద'కు అబ్బింది. అప్పట్లో వరదను బాలకవి అనేవారు. కుర్రవాడు అందంగాను, చురుకుగాను ఉండేవాడు. ఎ.వి.యన్.కాలేజీలో వరద విద్యార్థిగా ఉన్నప్పుడు సాంబమూర్తి సోమయాజులు గారు అనే ఒక టీచర్ ఉండేవారు. ఆయనకు రామకృష్ణారావు గారంటే ఎంతో భక్తిశ్రద్ధలు ఉండేవి. రామకృష్ణారావు గారి కొడుకు మీద కూడా ఆయనకు అభిమానం ఏర్పడింది.

రాయ్ దంపతులు విశాఖపట్నంలో అప్పుడు 3 వారాలున్నారు. శ్రీ ఎ.వి.భానోజీరావుగారు మున్సిపల్ ఛైర్మన్‌గా ఉండేవారు. పి.హెచ్. గుప్తగారు భానోజీరావుగారికి ఆప్తమిత్రులు. గుప్తగారి ప్రోద్బలంతో భానోజీరావుగారు ఎమ్.ఎన్.రాయ్‌కి మున్సిపల్ టౌన్‌హాల్‌లో పౌరసన్మానం ఏర్పాటు చేశారు. ఆ సభకు వరద, వాణి, వారి మిత్రులు అనేకమంది విద్యార్థులను సభకు తీసుకు వచ్చారు.సభ దిగ్విజయంగా జరిగింది.

ఆ తరువాత మేము యూత్‌లీగ్ అనే సంఘాన్ని ఏర్పాటు చేశాం.మొదటి అసెంబ్లీ ఎన్నికలలో తెన్నేటి విశ్వనాథంగారు కాంగ్రెస్ అభ్యర్థిగానూ, భానోజీరావుగారు జస్టిస్ పార్టీ అభ్యర్థిగానూ పోటీచేశారు. భానోజీరావుగారు ఓడిపోయారు.

ఆ తరువాత కొంతకాలానికి భానోజీరావు గారిలో ఒక మార్పు వచ్చింది. ఆయన కాంగ్రెస్‌లో చేరడానికి నిర్ణయించుకున్నారు. యూత్‌లీగ్ తరపున మేము టౌన్‌హాల్లో ఒక సభ భానోజీరావుగారి కోసం ప్రత్యేకంగా ఏర్పాటుచేశాం. అప్పుడు పి.హెచ్.గుప్తగారు టౌన్ కాంగ్రెస్ ప్రెసిడెంట్‌గా ఉండేవారు. ఆ మాసభకు గుప్తగారిని అధ్యక్షులుగా ఉండమన్నాం. ఆయన వెనకా ముందు ఆలోచించి అంగీకరించారు. ఆ సభకు యూత్‌లీగ్ సభ్యులను-యువకులను, విద్యార్థులను వందలాది మందిని సమీకరించడంలో వరద చేసిన కృషి ప్రశంసనీయమైనది.

అంతకుముందు ఎమ్.ఎన్. రాయ్‌ని ఎ.వి.యన్.కాలేజీ విద్యార్థుల సభలో ప్రసంగించడానికి వరద, మరి కొంతమంది విద్యార్థులు ఎంతో కృషిచేశారు. కొంతమంది కమ్యూనిస్టు సానుభూతి విద్యార్థులు ఈ మీటింగు జరగకుండా అవరోధాలు కల్పించడానికి ప్రయత్నించారు. సాంబమూర్తి సోమయాజులు గారి సహకారంతో వరద ఈ సభ దిగ్విజయంగా జరిగేట్లు కృషిచేశాడు.

1938లో నేను గుంటూరు వెళ్ళి పోయినాను. 1939 లో సెప్టెంబరు 1న రెండో ప్రపంచయుద్ధం మొదలైంది. 1940లో జపాను విశాఖపట్నం మీద బాంబులువేయడంతో ఆంధ్రవిశ్వవిద్యాలయం గుంటూరుకు మారింది. ఈ మధ్యకాలంలో అబ్బూరి కుటుంబంతో నాకు అంతగా సంబంధం లేకపోయింది.

ఆ తరువాత 1942 లో అనుకుంటాను. రామకృష్ణారావుగారు 'నటాలి' అను నాటక సమాజం ఏర్పాటు చేశారు. ఆ రోజుల్లో బ్రిటిష్ ప్రభుత్వం 'నేషనల్ వార్ ఫ్రంట్' అను ఒక సంస్థను ఏర్పాటుచేసింది. ఈ నేషనల్ వార్‌ఫ్రంట్‌తో నటాలి ఒక కాంట్రాక్టు కుదుర్చుకుంది. అది ఒక సంవత్సరం కాంట్రాక్టు. 'వరద' రాసిన 'ప్రతిమాసుందరి' నాటకాన్ని ప్రదర్శించడానికి నటాలి నేషనల్ వార్‌ఫ్రంట్ సహకారం తీసుకుంది. ఈ 'ప్రతిమాసుందరి' నాటకాన్ని రాయలసీమ మినహా మిగతా ఆంధ్ర రాష్ట్రమంతటా ప్రదర్శించాం. వరద, వాణి స్టేజి ఏర్పాట్లు చేయడంలో తీవ్రకృషి చేశారు. అంతకు పూర్వం రోజుల్లో హరిశ్చంద్ర నాటకానికీ, చింతామణి నాటకానికీ కూడా ఒకే రకపు కర్టెన్లు ఉండేవి. ఈ 'ప్రతిమాసుందరి' నాటకానికి కొత్తరకపు కర్టెన్లు, కొత్తరకపు సీనరీలు, కొత్తరకపు సెట్టింగ్‌లు ఏర్పాటుచేశారు. వరద ఇచ్చిన ఐడియాలతో అంతా కొత్తదనం కనిపించింది. అలాగే నటాలి ప్రదర్శించిన 'కన్యాశుల్కం' నాటకంలో కూడా సెట్టింగులు, సీనరీలు కొత్త ఫక్కీలో ప్రదర్శించారు. ఈ సీనరీలు, సెట్టింగ్‌లు మొదలైన వాటిని ఏర్పాటు చేయడంలో వరద, వాణి తమ తండ్రికి ఎంతో తోడ్పడ్డారు. 'ప్రతిమాసుందరి' నాటకం రిహార్సల్స్‌లో వరద ఎన్నో సూచనలు ఇచ్చేవాడు. 'ప్రతిమాసుందరి' నాటకం మూలంగా వరద పేరు ఎంతో ప్రచారంలోకి వచ్చింది.

ఆ తర్వాత వరద హైదరాబాదు వచ్చి కొంతకాలం సెటిలైనాడు. అప్పుడు హైదరాబాదు ముఖ్యమంత్రిగా డా. బూర్గుల రామకృష్ణారావుగారు ఉండేవారు. వి.బి.రాజు గారు కూడా ఒక మంత్రిగా ఉండేవారు. అప్పటికి ఆంధ్రప్రదేశ్ ఏర్పడలేదు. బిందు, మేల్కోటె వంటి ఇతర రాష్ట్రాల వాళ్ళు కూడా మంత్రులుగా ఉండేవారు. వీరందరితోనూ వరదకు సాన్నిహిత్యం ఉండేది. ఒకసారి అబ్బూరి రామకృష్ణారావుగారు బూర్గుల రామకృష్ణారావుగారిని కలుసుకోవలసి వచ్చింది. అబ్బూరి బూర్గులవారితో మాట్లాడిన తర్వాత ముఖ్యమంత్రి (బూర్గుల) 'వరదతో మాట్లాడతాలెండి' అన్నారుట. ఈ విషయాన్ని రామకృష్ణారావుగారు నాతో స్వయంగా చెప్పారు. రామకృష్ణారావుగారు వరదకుముఖ్యమంత్రి దగ్గర ఉన్న పలుకుబడితో ఆశ్చర్యపోయారు. ఆనాటి మంత్రులంతా కూడా వరదతో ఎంతో సన్నిహితంగా ఉండేవారు. హైదరాబాదులో ఉండగానే వరదకు ఛాయాదేవితో వివాహమైంది.

తరువాత ఈ దంపతులు ఢిల్లీ వెళ్ళిపోయారు. నేను ఢిల్లీలో నా రెండవకొడుకు బిజినెస్‌లో

ఉండగా చూడటానికి వెళ్లి వరదకు ఫోన్ చేశాను. వరద నన్ను మధ్యాహ్నం తమ ఇంటికి లంచ్‌కి ఆహ్వానించారు. నాకు ఢిల్లీ కొత్తకావడంవల్ల నేను, మా అబ్బాయి ఇద్దరం వెళ్ళాము. ఛాయాదేవి మాకు ఎంతో ఆప్యాయంగా విందు భోజనం పెట్టింది.

ఆ తర్వాత మళ్లీ నేను, వరద హైదరాబాదు లోనే కలవడం తటస్థించింది. హైదరాబాదులో ప్రస్తుతం వారుంటున్న ఇల్లు కొనుక్కొని సెటిల్ అయినారు. తండ్రిమాత్రం వరద ఢిల్లీలో ఉండగానే ఢిల్లీలోనే మరణించారు. వరదకు తన తండ్రి మీద అపారమైన భక్తి, గౌరవం ఉండేవి. అందుకే ఒక స్మారక గ్రంథం కూడా వేశారు. అందులో నా వ్యాసం కూడా ఉంది. 'వరద' నాకు ఒక ఆప్త మిత్రుడు, అతి సన్నిహితుడు.

["వరద స్మృతి" కోసం ప్రత్యేకంగా రాసిన వ్యాసం]

## ఒక స్మృతి

**అజంతా**

సుడిగాలిలో అక్షరాలు కొట్టుకొని పోతుండగా చూశాను
అతడు లేడు
శబ్దప్రపంచం మూర్ఛిల్లినదా!
బ్రతుకంతా ఒకే జ్వాల, ఒకే ధ్వని, ఒకే దృశ్యం,
ఒకే అన్వేషణ
ఒకేవిజృంభణ
అతడు ఎక్కడ ఉన్నా ఇంద్రధనుస్సులే,
స్వప్నసామ్రాజ్యాధిపతి కదా. కవిత్వానికి అర్ధరాజ్యం ఇచ్చాడు ఏనాడో
స్నేహానికి అర్థసింహాసనం
కవిత్వం అంటే ఉన్మత్తధ్వని కదా
అశ్వశక్తి విశృంఖల ధ్వని కాదు
గుండె తలుపులు మెల్లగా తెరచుకొంటున్న మంత్రమయ ధ్వని
అతడు నిర్దేశించిన మార్గంలోనే ఎంతో దూరం నడిచాను నేను కూడా
నా చుట్టూ దీపాలు అతడు వెలిగించినవే
నా హృదయంలో ఒక భాగాన్ని అక్కడే నిక్షిప్తం చేశాను
బ్రతుకంతా కవిత్వ మహోత్సవం
ఒకే కల, ఒకే జ్వాల, ఒకే ఛందస్సు,
ఒకే అన్వేషణ
అన్వేషణ పూర్తికాక ముందే తాను వచ్చిన త్రోవ తానే తెరచుకొని
మంచు తెరలలో అదృశ్యమైపోయాడు మౌనంగా
నేను మాత్రం ఇంకా ఇక్కడే బ్రతుకు లోలోతులలో కూరుకొనిపోతున్నాను అసంకల్పింతంగా
నిష్క్రమణ ద్వారం ఎపుడు తెరచుకొంటుందో మరి!
[ఆత్మీయుడు అబ్బూరిని తలచుకొని]

('ఆంధ్రప్రభ' అక్టోబరు 11, 1993.)

*

'అక్కడా క్రేక్సే'- మాఆఖరి ఆడబడుచు భర్త ఎటామిక్ పవర్ ప్రాజెక్ట్‌లో పనిచేసేవాడు పెళ్ళయిన కొత్తలో. ఆ ప్రాజెక్ట్ గురించి మాట్లాడుతూ, వాళ్ల కన్‌స్ట్రక్షన్ లోపల 'క్రేక్స్'(బీటలు) వచ్చాయనీ, ఇది రాబోయే పార్లమెంట్ సమావేశంలో చర్చనీయాంశం కావచ్చుననీ, "కొందరు సభ్యులు...."అంటూ ఆందోళనకరంగా చెబుతూంటే, "మరేం భయంలేదు, అక్కడా క్రేక్సే!" అన్నారాయన!

'వెర్రిపబ్లిక్‌డే'- న్యూఢిల్లీలో 'రిపబ్లిక్ డే పెరేడ్' చూడటానికి అంత చలిలోనూ జనం వేలంవెర్రిగా వెళ్లడం, గంటల తరబడి పేవ్‌మెంట్లమీద పడిగాపులు పడి ఉండటం చూసి 'ఇది వెర్రి పబ్లిక్ డే' అనేవారు!

'చారుశీల'- ఏ గృహిణి అయినా 'చారు' రుచిగా చేస్తే 'చారుశీల' అనిబిరుదిచ్చేవారు.

'లడ్డూ వెంకటేశ్వర'- తిరుపతిలో లడ్డూల కోసం క్యూలో నిలబడటం, లడ్డూల కోసం ఎగబడటం, లడ్డూల ఖరీదు అంతకంతకి పెరిగిపోవడం చూసి "ఈయన్ని లార్డ్ వెంకటేశ్వరా కాదు, లడ్డూ వెంకటేశ్వరా అనాలి' అన్నారు!

'సతీ డొక్కుబాయి'- పెళ్లయిన కొత్తలో జబ్బు చేసి బాగా చిక్కిపోయాను. నన్ను చూసి 'సతీ డొక్కుబాయి' అని వ్యాఖ్యానించేవారు

'వెంకటరంగయ్యగారిలా'- గృహస్థుడయాక, ఇంటికి 'నేమ్‌ప్లేట్' తయారు చెయ్యడానికి ఆర్డరిచ్చారు. అక్షరాలు ఇంగ్లీషులో రాసి ఇచ్చారు. ఆయన చెప్పిన బోర్డ్ సైజులో ఆయన పేరు సరిపోక, అక్షరాల్ని సన్నగా పొడుగ్గా చేసి ఎలాగో సరిపెట్టి పట్టుకొచ్చాడు బోర్డు చేసినతను. ఆ అక్షరాల్ని చూడగానే "ఇవి మామిడి పూడి వెంకటరంగయ్యగారిలా ఉన్నాయి! అని వ్యాఖ్యానించారు! (ఆయన వాళ్ల గురువుగారే).

'కలరా'- న్యూస్ పేపర్లలో కలర్ ప్రింటింగ్ ప్రవేశ పెట్టిన కొత్తలో కొన్నిసార్లు రంగులు ముట్టుకుంటే అంటుకునేలా చవకబారుగా 'గాడీ'గా కనిపించేవి. అవి చూసి "ఈ రోజుల్లో పేపర్లు ముట్టుకుంటే 'కలరా' వచ్చేట్టుంది! అన్నారు.

'అగ్లీగా....'- నేను చేసిన ఒక బొమ్మని ఆయనకి చూపించి 'ఏమండీ, 'అగ్లీ'గా ఉందా?' అని అడిగాను-లేదులే, ఫరవాలేదు అంటారని ఆశిస్తూ. "అగ్లీగా ఉన్నవాళ్లు మాత్రం లోకంలో లేరుటే!" అన్నారు తాపీగా.

'ఓ, దోమాస్!'- దోమలు కుడుతూంటే 'ఓడొమాస్' రాసుకోమని సలహా ఇస్తే, 'వాటిని 'ఓ, దోమాస్!' అని పిలుస్తూంటే కుట్టకుండా ఉంటాయా'అన్నారు!

'కేపిటల్ దాసులు'- మార్క్సిస్టులమని చెప్పుకునే కొందరు ధనికవర్గం వారినీ, 'దాస్‌కేపిటల్'ని చీటికీ మాటికీ ఉదహరించేవారినీ 'కేపిటల్ దాసులని' చమత్కరించేవారు.

'పద్మదూషణ్'-ఎప్పుడూ ఎవరినో ఒకరిని తీవ్రంగా విమర్శించడం అలవాటున్న ఒక మిత్రుడికి "పద్మదూషణ్" అని బిరుదిచ్చారు!

'శ్రీనాయ్‌రేకులు'-మా రెండవ మరిది శ్రీనాథ్ పెళ్లి జరుగుతూంటే పెద్దవాన మొదలై, వాన చప్పుడుకి పెళ్లిమంత్రాలు వినిపించడం లేదు "హాలు పైన సీనా రేకులు వెయ్యడం మూలాన్ని మరీ చప్పుడవుతోంది" అన్నారు ఎవరో వెంటనే ఈయన 'సీనా రేకులు

కాదు, 'శ్రీనాయ్' రేకులు! అన్నారు-తమ్ముడి పేరు ఇరికించి.

'హామ్‌క్యామేహై'-ఎవరైనా బంధుమిత్రులు కలిసినప్పుడు "ఎలాఉన్నారు"? అని ఈయన్ని కుశల ప్రశ్నవేస్తే, "హమ్‌క్యామేహై" అనేవారు (టెలిఫోన్ ఎక్ఛేంజ్ వాళ్ల 'ఆప్‌క్యామేహై' అన్నట్లు).

'కట్టెలే చుట్టాలు'- ఈయనకి రకరకాల చేతికర్రలు పోగుచెయ్యడం ఒక సరదా. ఒక సభకి చేతికర్రతో వెళ్లారు. ఆయన్ని చూసి ఎవరో 'అప్పుడే కర్రపట్టుకున్నారేమిటి?' అన్నారు. వెంటనే ఈయన 'కట్టెలే చుట్టాలు కదా' అన్నారు!

'రంభ' – అధికార భాషా సంఘం అధ్యక్షపదవి లభించినందుకు ఒక మిత్రుడు అభినందిస్తే, "ఈ వయస్సులో రంభనిస్తే ఏం చేసుకోను?' అన్నారు!

'పాతచింతకాయ పచ్చడి'- అదే సందర్భంలో మరో మిత్రుడితో 'అది పాతచింతకాయ పచ్చడి, జబ్బువాళ్లకే ఇస్తారు' అన్నారు!

'వైద్యోనారాయణోహరి'-"అంటే, వైద్యుడు వచ్చి 'నారాయణ' అంటాడు, పేషెంట్ 'హరీ' అంటాడు" అని అర్థం చెప్పేవారు!

['అ.ఛా]

## మరికొన్ని 'వరదోక్తులు'

### సామెతల శైలిలో

- 'బ్రహ్మ జ్ఞానులు వచ్చారు బట్ట గుడ్డలు భద్రం
  మహానాయకులొచ్చారు మనీపర్సులు భద్రం'
- 'బాపడికి పప్పాశ, మంత్రికి మందాశ, అల్లుడికి అత్తాశ'
- 'పదవి పోయినవాడూ పదం పాడిన వాడూ ఒకటే'.
- 'భిక్షానికి వచ్చినా బిగుమానం చావలేదు
  చందాకు వచ్చినా హుందా చావలేదు'.
- 'భోజనం చేసిన వానికి అన్నం వేడుక,
  ఎం ఎల్ ఏ కు ఎన్నికల వేడుక
  బోడితలవానికి తలంటువేడుక'.
- 'మంచి ఎం ఎల్ ఏ అని దండం పెడితే
  శ్రీఘ్రమేవవయోజన పుత్రప్రాప్తిరస్తు అన్నారట'.

[నోట్ బుక్స్‌లో దొరికినవి]

# అనుబంధం

## నామసూచిక

[ఇందులోని లేఖలూ, వ్యాసాలూ, పత్రాలూ, సమీక్షలూ మొదలైనవి రాసిన వారి నామసూచిక]